# ఆదర్శ భారతము

ఉభయభాషా ప్రవీణ,
**పెరవలి లింగయ్యశాస్త్రి**
సీనియర్ తెలుఁగు పండితుఁడు,
గవర్నమెంటు హైస్కూల్,
చాదర్‌ఘాట్, హైద్రాబాద్-ద.

ప్రకాశకులు:
**మూర్తి అండు కో.,**
కింగ్స్‌వే, శికింద్రాబాదు-ద.

1952

H. S. వెల 1-0-0

ఆంధ్ర బుక్ హౌస్
మజ్లాన బజార, హైదరాబాద

# తొలిపలుకు

ఉభయభాషా ప్రవీణులలో శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రిగారు గురుముఖముగా సశాస్త్రీయముగా అధ్యయనముచేసి దిటమైన సంస్కృతాంధ్ర పండితులు, నాసతీర్థ్యులు, బహుసారస్వత పత్రికలం దుత్తమ రచనలను వెల్లడించిన విద్వాంసులు. వీరు ఆదర్శభారతము అను ప్రశస్త గ్రంథమును రచించినారు. పాఠకుల యాదర్శమునకు గొప్పవారిని నల్గురిని గురించి తెలిపినారు. యుధిష్ఠిరుడు పౌరాణిక మహాపురుషుడు. శ్రీకృష్ణాదుల నతులందినవాడు. శత్రువులచేతను కీర్తింపబడినవాడు. రుద్రమదేవి భారతీయ చారిత్రక నారీమతల్లులలో నిస్సందేహముగా నగ్రస్థానమలంకరించినట్టి మహావీర. అనపోతనాయుడు ఆంధ్రవీరులలో ప్రసిద్ధిగన్నవాడు.

కన్నమదాసు అనాదృతజాతిలో పుట్టి ఉత్తమకులజులమను గర్వించువారిని తనగుణముచే, నీతిజ్ఞతచే, శౌర్యపరాక్రమములచే, అధిగమించి యసాధారణ మహాపురుషుడని చాటినట్టి జగజెట్టి

ఇట్టి యాదర్శ జీవితములను పాఠకులకు అందు ముఖ్యముగా విద్యార్థుల కందించుటయే సరియగు దేశసేవ.

"మహాజనో యేన గతస్సపంథాః" అన్నారు మనపెద్దలు.

"యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
సయత్ ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే"

అన్నాడు గీతాచార్యుడు. ఈభావాలనే అమెరికా కవిరాజగు లాంగ్ ఫెలో తన **Psalm of life**(జీవన గీతము)లో నిట్లు సుందరముగా గానముచేసెను.

**Lives of great men all remind us**
**And departing leave behind them**
**Foot prints on the sands of time.**

ఉత్తమ భావాలతో కూడిన విషయము రచన కాత్మ. దానికి తగిన శరీరము శైలి. భావానుగుణ్యము కాని శైలి భావములను వ్యక్తీకరింపజాలదు.

మిత్రులగు శ్రీలింగయ్యశాస్త్రిగారి శైలి పటుత్వము కలది. తట్టు కొనక ధారాళముగా గంభీరముగా సాగినది. పాఠకుల నాకర్షించునదై యున్నది. సుందర వర్ణనములు, చక్కని నుడికారములు, సంస్కృతాంధ్రరీతు లిందు విరివిగా కాననగును.

అన్ని విధముల నిది ప్రశస్తమగు ఉత్తమ రచన.

సురవరము ప్రతాపరెడ్డి,

హైదరాబాద.



# నివేదనము

బహుకాలమునుండి నాకుఁగల బోధనానుభవమును బురస్కరించుకొని, ప్రాచీనార్వాచీన భారతాదర్శవీరుల చరిత్రలను 'ఆదర్శభారత' మను పేరుతో రచియించితిని.

శాంత్యహింసలతో శౌర్యసాహసములను జతగూర్చి చల్లగా సాగించు నీస్వతంత్రభారత వీరుల కిట్టి యాదర్శ వర్తనుల వీరగాథ లొజ్జబంతులనఁ జెల్లును. ప్రాచీనౌన్నత్య వైభవ, పరాక్రమ సంస్మరణము జాతికావేశోత్సాహములఁ బుట్టించి, జాతీయ పురోభివృద్ధికి, నౌన్నత్యసంపాదనమునకుఁ గర్తవ్యనిర్వహణ దక్షతకు సాధనమగునుగదా?

రసజ్ఞపాఠకలోకము, ఇపుడిపుడే దేశభాషలపైఁ బ్రత్యేకశ్రద్ధను జూపుచున్న ప్రభుత్వమువారు, పఠన, పాఠనములలో సమాన భాగస్వామ్యము గల సోదరోపాధ్యాయ బృందమును బ్రోత్సహించుచో నాయీచిన్ని యుద్యమము చరితార్థమగును.

చరిత్రకథారచనమున నాకుఁ దోడ్పడిన 'యాంధ్ర చరిత్రకారులకు' నా సప్రశ్రయ ప్రణతులు.

సర్వాంధ్రదేశమున సర్వతోముఖముగా లబ్ధప్రతిష్ఠులును, పూజ్యులును, సహృదయులును, మిత్రులు నగు సురవరము ప్రతాపరెడ్డిగారు కోరిననంతనే తమ యమూల్యావకాశమును వినియోగించి యీచిన్ని పొత్తమునుజదివి 'తొలిపలుకును' వ్రాసియిచ్చిరి. శ్రీవారికి నా సవినయ ప్రణతులు.

—రచయిత.

# విషయసూచిక

—:o:—

శ్రీరామాయనమః

# ఆదర్శ భారతము

——:o:——

## 1. యుధిష్ఠిరుఁడు

భరతఖండము మహాపురుషులకు, త్యాగైకధనులకును, నిరవద్యశేముషీ విశేష వినిర్జిత సురాచార్యులగు పండితులకును జన్మభూమి.

సర్వ సర్వంసహామండల మండనాయమానంబగు నీ భారతావని 'సూర్య' 'చంద్ర' వంశంబులను నభిధేయంబుల నొప్పారు క్షత్రియ వంశములు రెండు చెన్నారుచుండెను. అందు సూర్య వంశ్యులగు రాజపుంగవు లయోధ్య రాజధానిగా రాజ్యమేలిరి. సితశీతల కిరణపుంజ ప్రసారమునఁ బ్రపంచము నాహ్లాదవారాన్నిధి నోలలాడించు సుధాకరుఁడు చంద్ర వంశమునకుఁ గర్తయు, భర్తయునై యున్నాఁడు. చంద్రవంశ్యులగు రాజ చూడామణులకు మొదటి రాజధాని యధిష్ఠానపురము. తరువాతి రాజధాని హస్తినాపురము.

కువలయానంద సంధాయకులగు నీయిందు వంశ్యులలోఁ బురూరవసుఁడు, నహుషుఁడు, యయాతి, పూరుఁడు. దుష్యంతుఁడు, భరతుఁడు మున్నగు వారు దశదిశావకాశముల లబ్ధ ప్రతిష్ఠులై వెలసిరి.

ఇట్టి వాసియు, వన్నెయుంగల యీవంశమున జనించిన శంతనుఁడను బుడమిఱేఁడు కారణాంతరమున మానవవనితా రూపధారిణియగు గంగాదేవియందు, నవక్ర విక్రమశాలియు,

నశేషధర్మా ధర్మవేదియు నగు దేవవ్రతుండను కుమారుం గాంచెను.

వసిష్ఠ భార్గవరాములకడ నన్ని విద్యలం గఱచి యీదేవ వ్రతుండు యౌవనమునఁ బితృర్థమై 'రాజ్య పరిత్యాగము' 'బ్రహ్మచర్యము'నను భీష్మప్రతిజ్ఞలంజేసి భీష్ముండనఁ బ్రసిద్ధుండయ్యె.

ఉద్వాహమాడిన సత్యవతియందు శంతనుండు 'చిత్రాంగద, విచిత్రవీర్యు'లను నిరువురు పుత్రులం బడసెను. వారికి శైశవము గడవకమున్నె శంతనుండు దివంగతుఁడయ్యె. పసి నిసుఁగులగు తమ్ముల దేవవ్రతుండు పెంచి పెద్దవారిం జేసి యన్ని విద్యలం గఱపి వారిలో జ్యేష్ఠుండగు చిత్రాంగదునిఁగౌరవ రాజ్యసింహాసనము నధిష్ఠింపఁజేసెను. ఉద్వృత్త సంచారుండగు నాతండు తనకు సనాముండగు గంధర్వునిచేఁజంపఁబడియెను. పిదప గాంగేయుండు విచిత్రవీర్యునిఁబట్టాభిషిక్తుంజేసి స్వయంపరాగతులగు రాజపుత్రులనిర్జించి. కాశీరాజ దుహితల నంబి కాంబాలికలందెచ్చి యాతనికిఁ బరిణయ మొనర్చెను. విచిత్ర వీర్యుం డావనితల యనన్య కన్యకాజన సామాన్య రూపలావణ్యములకు వశుండై, యత్యాసక్తుండై యసువులంబాసెను.

పుత్ర మరణదుఃఖితయగు సత్యవతిని, భర్తృ మరణ విషణ్ణలగు మఱదండ్రను శోకాపనోదంబగున ట్లాశ్వాసింపఁజేసి, దేవవ్రతుం డరాజకంబగు రాజ్యంబు నకలంకంబుగాఁ బ్రతి పాలించుచుండె. సత్యవతిచే వంశము విస్తరింపఁ జేయఁ బలు విధములఁ బ్రబోధింపఁబడియు, సుద్వాహ మాడుటకు దేవ వ్రతుండిచ్ఛగింపక "తల్లీ! నేనన్ని ధర్మంబుల నెఱుంగుదు. పిత్రర్థము నాచేకొనిన సద్వ్రతంబు విడువనొల్లను. విచిత్ర వీర్య క్షేత్రంబుల నిత్యసత్యవచనుండగు కృష్ణద్వైపాయనుండు నీనియోగంబుచేఁ దన తపోవిహితప్రభావంబున సంతతిం బడయుఁ గాక" యని వచియించె. సత్యవతి యమ్మహామహుందలంప నాతండేతెంచె. ఆయమనియోగంబున, నాతని యమలినతపః

ప్రభావంబున నంబికకు ధృతరాష్ట్రుండును, నంబాలికకుఁ బాం డుఁడును ప్రభవంబంది యిందువంశ విస్తారకులైరి. అంబికా దాసి యందు యమునంశచే విదురుండు జననంబందె. ధృత ష్ట్రుఁడు పుట్టంధుఁడు. ఈ కుమారత్రయము రాజకుమారోచిత విద్యావిశేషముల నన్నిఁటిని నేర్చి, పెరిగి పెద్ద వారై రి.

ధర్మవేదియగు మందాకినీనందనుండు విచిత్రవీర్యనంద నులు యౌవనప్రాదుర్భావము గలవారు కాగా జ్యేష్ఠుఁడగు ధృత రాష్ట్రునిఁ బట్టాభిషిక్తుంజేసి, పాండుభూపాలు సేనానాయకుంగాఁ జేసి మహాప్రజ్ఞాశాలియు రాజనీతి కోవిదుఁడగు విదురుని మహా మాత్యునిగా నొనర్చెను. దేవవ్రతుని యనుమతిని ధృతరాష్ట్రుండు గాంధారిని వివాహమాడెను. పాండు భూజానియు యాదవకుల విభుఁడగు శూరుని పుత్రియు, కుంతిభోజుని పెంపుడు బిడ్డయు వసుదేవుని చెలియలును నగు పృథయను బేరుగల కుంతిని, వినయాభిమాన వివేకసౌజన్యాది సదమల గుణరత్న జన్మభూమి యగు దానిని, స్వయంవరమున వివాహమయ్యెను. మఱియు మద్రరాజదుహితయు సౌందర్యరాశియు నగు మాద్రిని మహో త్సవమునఁబరిణయ మయ్యెను. విచ్ఛిన్నముకానున్న కురువంశ మిట్లు సర్వతోముఖాభివృద్ధి నందుచున్నదిగదా యని సత్యవ తియు, గాంగేయుండును సంతసించు చుండిరి.

పాండుభూజాని పరిపాలనా విషయమున నన్నకుఁ గుడి భుజమై దిగ్విజయంబొనర్చి సమస్త ధరణీ నాథులనుండి కప్ప ములుఁగా ననంత సువర్ణరాశులఁ గొనివచ్చి ధృతరాష్ట్రునిచే ననేక వాజిమేధంబులం జేయించెను. మఱియు ననేక ధనరత్న సువర్ణ రాసుల బంధుల, హితుల, మహీసురులఁ దనిపెను. అంధుఁ డగునన్నకు నండయై రాజ్యచక్రమునేలు పాండుభూవరుని పరి పాలనము పూరుభరతాదుల యేలుబడిం దలపించు చుండెను.

## మృగయావ్యసనము, శాపము

వాసవ సన్నిభుండగు నా భూవరుండు ధర్మపత్నులు వెం

టిరా హిమవన్నగ పార్శ్వభూముల బాణాసన బాణభాసిత మహా భుజుఁడై యేగి సప్తవ్యసనములలో నొకటియగు మృగయావ్యసనంబునందగిలి క్రీడించుచు నొక్కనాఁ డొక్క మృగంబేని దృష్టిగోచరంబు గామి విసిగి వేసరి యొక్క చోట మృగరూపధారులై క్రీడించుచున్న ఋషిదంపతులఁ బ్రేళ్ళ నేసెను. అల్పావశిష్ట ప్రాణుండగు కిందముండను ముని, "వసుంధరా వల్లభా! కిరాతులు సైతము క్రీడించుచున్న మృగముల నేయరు. సర్వధర్మాధర్మ వేదివయ్యు నీవీ వ్యసనంబున, గ్రీడించుమమ్ము వధించితివి. అందుచే నీవును బ్రియాసమాగ మానుక్షణంబున నే పంచత్వంబు నొందుదువుగాక" యనిశపించి యసువుల వీడెను. దుర్వ్యసనాసక్తుండగు వానికి సత్ఫలంబు గలుగదుగదా!

## తపశ్చర్య

నిరంతర ధర్మనిరతుండగు తన కిట్టి దుర్వ్యసనము కర్మవశముననే సంభవించెనని మిగుల వగచి, విరక్తుండై యహింసా వ్రతీయై, యయాచితో పస్థితములగు ఫలపర్ణాంబుల నాహారముగాఁ గొనుచుఁ దపశ్చర్య నుండెను. సాధ్వీ శిరోమణులగు కుంతీమాద్రులు భర్తచే నివారితులయ్యుఁ దాము దపశ్చర్య నుండి, సేవించుచుండుట నతికష్టముపై నాతని నొప్పించిరి. తమకడ నుండు వస్త్రభూషణాదుల నచటి వారికి నిచ్చి తపస్వినీ వేషధారిణులై యాతని వెంటఁ దపశ్చర్య నుండి ధృతరాష్ట్రునకీ శాపవృత్తాంతము నెఱిఁగింపఁబంచిరి. పాండుభూజాని మనోనిశ్చలత, తపోనిష్ఠ మునిబృందంబులకును విస్మయావహంబై యుండెను. శతశృంగ పర్వతంబునఁ దపోనిష్ఠనున్న పాండుభూవరేణ్యుం డనపత్యులకు స్వర్గద్వారము ప్రవేశార్హము గాదని యెఱింగి తనకుఁగలిగిన శాపంబునకు, ననపత్యతకు మిగుల వగచెను. పాండుభూజాని విచారమునకుఁ ద్రికాలజ్ఞాన సంపన్నులగు మహర్షులు, "భూపాలా! నీవిద్దానికి విచారింపకుము. మునుముందు దేవతా వరప్రసాదమున దేవాంశసంభూతులైన

ఃసుపుత్రులంబడయంగలవు. అద్దానికి విచారింపకు" మనిరి. అయినను, బాండునరనాథుండు విచారపూరిత హృదయుండై యుండె. విదురునకు సంతతి గలిగెననియు గాంధారి యంత ర్వత్నియై యుండెననియు విని మిగులసంతసించెను.

ధవుని విచారంబెఱింగి, పృథయాశ్వాసింప నాంబాలికే యుండు "సాధ్వీ! సంతాన హీనులకుఁ బిత్రూణము తీఱదు. 'అపుత్రస్యగతిర్నాస్తి' యను వేదవచనంబువినవే, కిందను మహర్షి శాపంబునఁ దనకట్టి భవిష్యత్తులేదు గదా" యని వాపో యెను. అద్దానికిఁ గుంతియు వగచి, "చిన్ననాఁడు దుర్వాసుం డను నమోఘ తపశ్శాలి యొసంగిన మంత్ర వృత్తాంతంబు నెఱింగించి మీ యనుమతి యగునేని యభిమత దేవతలనారా ధించి వారి ప్రసాదమున సంతతిం బడయుదము. మీ కిష్టులగు దేవతావరులం బేర్కొనుఁ" డని సప్రశ్రయముగా వచించెను.

## కుమార జననము

ఆ పలుకులు తన వీనుల కమృతంపు సోనలై విందుసేయ నాభూధవుండు, "సాధ్వీ! ధర్మశాస్త్రములందును, బురాణము లందును సంతానము మేలని విందును. నీ వలన మావంశ ముద్ధ రింపఁబడఁగలదు. ఇట్టి యమోఘవరం బొసంగిన యా తపో ధనుండు ప్రశంసనీయుండు. సర్వసృష్టికిని ధర్మము మూలము. ఎల్లలోకంబులు ధమ్మవునంద తిరంబైయుండు. అది లేకున్నఁ బ్రజాపాలన మశక్యము. అందుచే నన్నివిధముల ధర్మమూర్తి యగు పుత్రుం బడయుటకు ధర్మదేవతయగు యమధర్మరాజు నారాధింపుము. అతని వరప్రసాదంబున జనించు నాతండు సర్వ విధంబుల ధర్మాత్ముండు కాఁగలం" డని యాజ్ఞ యిచ్చెను. అప్పుడు కుంతి పతికిం బ్రదక్షిణ నమస్కారంబు లొనర్చి ము నీంద్ర దత్తమంత్రంబు జపియించి శమనుం బ్రార్థింప నాతని వరప్రసాదంబున సకల చక్రవర్తిలక్షణ లక్షితుఁడును, సురు

చిరాకారుఁడును,మహాతేజశ్శాలియు, మహాబాహుండునగు పుత్రుం డుద్భవించెను. అకుమారవరు జన్మ సమయంబున భూత గ్రహ నక్షత్ర జాతం బంతయు సానుకూల్యముఁ జూపెను.

శాత్రవజైత్రతేజమున సర్వదిశల్ వెలుగొంద, నైంద్రన
క్షత్రయుతుండుగా శశి, ప్రకాశజయోన్నతమైన యష్టిమిన్
మిత్రముఖ గ్రహప్రతతి మేలుగ నాభిజితోదయంబునన్
బుత్త్రుఁడు ధర్మునంశమునఁ బుట్టె నతిస్థిరధర్మమూర్తియై.

దేవదుందుభులు మ్రోసెను. ఆకసమునుండి ప్రసూన వృష్టి కురిసెను.

"కురుకుల విభుఁడగు, ధర్మ
స్థిరమతియగు నీతఁడనుచు ధృతిఁజేసి యుధి
ష్ఠిరుఁడను నామము దాను
చ్చరించె నాకాశవాణి జనవినుతముగాన్."

"ఈ బాలుఁడు కురువంశములో నుత్తమప్రభువై ధర్మ వేత్తలలో నగ్రణియు, సత్యవాదియునై ధైర్యశాలియగుట యుధిష్ఠిరుండను నామమును వహించును" అని యశరీరవాణి మహాగంభీర సు మధురముగాఁ బలికెను.

పాండురాజును, కుంతీమాద్రులును పరమానంద సాగర మున నోలలాడిరి.

అటులనే పాండుభూజాని యనుమతినిఁ గుంతికి సమీర ణాంశంబున భీమసేనుండును, ఇంద్రాంశంబున నర్జునుండును, కుంతీవరముచే మాద్రీదేవికి నశ్వినీ దేవతల వరప్రసాదంబున నకుల సహదేవులును దేవతాగణంబు లలర జననం బందిరి. కుంతికి భీముండుదయించిననాఁడే ధృతరాష్ట్రునకు గాంధారి యందు హస్తిపురిఁ గలియంశంబున దుర్యోధనుం డుదయం బయ్యె. వాఁడు జనించినయప్పు డనేక దుశ్శకునంబులు మహా ఘోరంబుగఁ బ్రవర్తిల్లె. ధృతరాష్ట్రునకు దుర్యోధనుఁడాదిగా

నూఱుగురు పుత్రులు, మఱియు నొక పుత్రియు నుద్భవించిరి. ఈ విధముగాఁ బాండుభూపాలుఁడును, ధృతరాష్ట్రుఁడును సంతానవంతు లగుటఁజేసి కురు వృద్ధులు, గురు వృద్ధ బాంధవులు మిగుల సంతసించిరి.

## బాల్యము

యుధిష్ఠిరాదులగు పాండుకుమారులు తల్లి దండ్రులకడ నల్లారు ముద్దుగా నేఁటఁబెఱుగు వారు పూటకుఁ బెఱుగుచుఁ, బుష్టి గలిగి, తేజస్సత్త్వముల నొప్పి పితరుల నానందింపఁజేయుచుండిరి. శతశృంగనివాసులగు మునులు, వారి భార్యలును వారినిఁ దమబిడ్డలవోలెఁ గాంచుచుండిరి. ఈ బాలుర బాల్యక్రీడలు, చేష్టలు ముక్తసంగులగు మహర్షులకును వాత్సల్యజనకములు, విస్మయాపాదకములు నగుచుండెను.

ఇట్లుఁ బాండు భూవరేణ్యుండు పుత్రులం బడసెనను శుభవార్త వసుదేవాదు లెఱింగి మిగుల నానందించి, సహోదరీ పుత్రులగు పాండవేయులకు రాజకుమారోచిత మణిభూషణాంబరాదులను, కుంతీ మాద్రులకు దాసదాసీజనమును, గోవులను, ధనమును విశేషముగాఁ బంపిరి. ఇట్టి వస్తుసామగ్రులం గొని వచ్చిన పురోహితుండగు కాశ్యపునిఁ బాండురాజు మిగుల సన్మానించెను. వసుదేవుండు తమపైఁ జూపిన ప్రేమకుఁ గుంతీ మాద్రు లిరువురు కడుంగడు సంతసించిరి. వసుదేవ పురోహితుండగు కాశ్యపుండు పాండు కుమారులకు బాల్యకృత్యంబులం దీర్పించి సకాలమున నుపనీతులుగా నొనర్చెను.

నాటినుండి యుధిష్ఠిరాది రాజపుత్రులచటఁ దపంబు సేయుచున్న శర్యాతి కుమారుండగు శుకుని సన్నిధి వేదత్రయము సాంగముగా ధనుర్వేదంబు నభ్యసించిరి.

## పాండురాజు నిర్యాణము

ఇంతలో వసంతవాసరములు సర్వప్రకృతి పులకించునట్లు

పొడసూపెను. తరులతాదు లాపాదమస్తమును జిగిర్చి వినూతన పల్లవపుష్పపరిశోభితములై నేత్రానంద మొనర్చు చుండెను. కమ్మని లతాంతముల సుమధురపరిమళ దాసవములఁగ్రోలి మత్తమధుపములు ఝుంకారములొనర్చుచుండెను. సహకార పల్లవముల మెసవి గండుకోయిలలు కుహూనినాద మొనర్చు చుండె. శీతలమంద మలయ పవమానములు హాయిగా వీచు చుండెను. వేయేల? ప్రకృతి యంతయు శృంగార రసా విర్భావ హేతువై మనోమోహనమై యలరారుచుండెను. ఇట్టి సకల భూత జాత సమ్మోహన కరమైన వసంత సమయమున నాంపాండు భూనాథుండు మాద్రీసౌందర్య ప్రలోభిత మానసుండై, ఋషి శాపమున ముక్కుపచ్చలాఱని పుత్త్రుల సాధ్వీమణులగు కళత్ర ముల నాయరణ్యమున వీడి స్వర్గస్థుఁడయ్యెను. మాద్రి సంజ్ఞా విరహితుఁడై పడియున్న ప్రాణనాథు పైఁబడి కరుణ యుప్పు తిల్లఁ బెద్దపెట్టున రోదనం బొనర్చె. ఆరోదన ధ్వని విని కుంతియు, యుధిష్ఠిరాదులు పఱువెత్తి వచ్చి పరిపరివిధముల విల పించిరి. కుంతియు, మాద్రియు సహగమన మొనర్పనుండ వనౌ కసులగు మహర్షు లేతెంచి వారి యాపత్తునకు మిగుల వగచి, ధైర్యముం గఱపి, "కుమారులు మిగుల బాలురు. ఇట్టి వీరిని వీడి సహగమనముసేయుట ధర్మువుగాదు. భర్త మరణించినను సాధ్వులగు వనితలు బ్రహ్మచర్యము నవలంబించి యమనియ మాదులచేఁ బవిత్రలై భర్తనే స్మరించుచు ముక్తిఁ గాంతురు. ఇట్టి ధర్మము నవలంబించి, పుత్త్రుల సంరక్షించుచు, మీరు జీవించియుండుటయే లగ్గు" అని వచియించిరి.

భర్త నిర్యాణమునకుఁ దానే కారణమగుట మాద్రి తన పుత్త్రులఁ గుంతికి నప్పగించి కుమారుల సంరక్షించు భారమును గుంతిపైనుంచి యాయమ నొప్పించి నకులసహ దేవులంగాంచి "కుమారులారా! మీకు నిజమగు జనని కుంతియే. నేను దాదిని. మీతండ్రి మరణించెను. 'పితృసమోజ్యేష్ఠః' అను న్యాయంబు చొప్పున నీయుధిష్ఠిరుండే తండ్రి. కావున ధర్మానువర్తియగు

నీతని యాజ్ఞానువర్తులై సుఖముండుఁ" డని బోధించి, యందఱ సెలవుంగొని భర్తతో సహగమనం బొనర్చెను.

మునులందఱును దమలోఁదాము విచారించి కుంతీ దేవి నిం గుమారులం దోడ్కొని హస్తినాపురంబునకు వచ్చిరి. పౌర జనులందఱును సురల వరప్రసాదమునఁ బాండుభూధవుండు సుపుత్రులం గాంచెనఁట. వారినిఁ జూతము రమ్మని భూజావిక్రమంబున సింహకిశోరంబులంబోని వారలం జూచి, "వీరలు దైవ శక్తిఁ బ్రభవించినవా రనుటకేమి సందియంబు? ఈ రమణీయ కాంతి, ఆకార విశేష సంపద, ప్రకాశిత తేజము వేల్పులకే కాక సాధారణ మర్త్యుల కుండునా!" అని నేత్రానందంబుగఁ గాంచిరి.

మునులు పాండుకుమారులం గుంతినిఁ గొనివచ్చిరని విని యాంబికేయుండు పుత్రశతంబుతో మంత్రి పురోహితాదులతో నెదుర్కొని సభామండపమునకుం గొనిపోయె. అప్పుడు భీష్మాదులగు కురువృద్ధులు సాదరప్రేమ, సమ్మాన పురస్సరముగా వారిని సంభావించిరి. పాండురాజు మరణంబునకు మిగుల వగచిరి.

అంత మునివృద్ధొకండు లేచి పాండు భూధవుండు శత శృంగమను పర్వతమునకుం జనిన దాదిగా నాటి వఱకు జరిగిన యెల్లవృత్తాంతమును సవిస్తరముగా నుడివి, "యీ కుమారులు కురు వంశ వివర్ధనులు, దేవస్వరూపులు, దేవతా వరప్రసాదంబున జనియించినవారు. బ్రహ్మర్షులు వీరి కుపనయనాది సంస్కారములం గావించిరి. కాన ధర్మబుద్ధితో నీ కుమారులట్ల వీరిని సంరక్షించుచుండునది" యని వారల నప్పగించెను. పిదప మహర్షులు సిద్ధచారణ గంధర్వులతో నంతర్హితులైరి. పాండునర నాథునకు, మాద్రికిని ధృతరాష్ట్రుఁడు కుమారులచేఁ బారలౌకిక క్రియల భూరిదాన దక్షిణల, బహుళాన్న దానములఁ జేయించెను. వ్యాసుండరుదెంచి వారి కందఱకు దుఃఖోప శాంతిం గలిగించి సత్యవతీదేవికి నేకాంతంబున "దుర్యోధనాదుల దుష్ప్ర

వర్తనంబు, భావికౌరవకుల ప్రళయంబు" నెఱింగించి సంసారంబున నాయమను విరక్తయగు నట్లొనర్చెను. ఆమెయు నంబికాంబాలికలం దోడ్కొని తపోవనంబునకేగి వారితో నతిఘోర తపం బొనర్చి కొండొక కాలంబునకు శరీరంబు విడచి యందఱుం బుణ్యగతింబొందిరి.

ధృతరాష్ట్రుండు పాండుకుమారులం దన పుత్త్రులకంటె నెక్కుడు ప్రేమతోఁ బెంచుచుండెను. ధర్మజుఁడు శేముషీ విశేషమహత్త్వమున వినయ సౌశీల్యాది సద్గుణంబులను కురువృద్ధులకు, గురువృద్ధులకుఁ బ్రీతిపాత్రమై "యిట్టి ధర్మాత్ముం డుండఁబో" దని యందఱు తలంప నాదర్శ పూరుషుండై ధర్మవీరుఁడైయుండె. తక్కుంగల పాండు భూనాథసుతులును బెద్దలయెడ వినమ్రులై పెద్దపిన్నల యంతరువు లెఱింగి యందఱతోఁ గలసి మెలసి వర్తించుచుండిరి.

దురభిమానియుఁ బాండవులయెడ దుష్టవర్తనుండునగు దుర్యోధనుండు పాండవుల నీతివిక్రమస్ఫురణంబులఁగాంచియు, నందునఁ బవననందను బాహుబలంబుగాంచియు మనంబెఱియ నాతని లతికాపాశములఁగట్టి గంగమడువునఁ ద్రోచియుఁ గాలాహులంగరిపించియు, విషాన్నంబుఁ బెట్టించియు, నుపాంశు వధ సేయనెంచెను. దైవరక్షితుఁడగునా వాయునందనునకెట్టి యపాయముంగలుగదయ్యె. సజ్జనులయెడ దుష్టులదురుద్యోగములు ఫలించునే?

కురు పాండవ కుమారులు శారద్వతుండగు కృపాచార్యునికడ భీష్మునిపనుపున నస్త్రశస్త్ర విద్యల నేర్చిరి. తరువాత భరద్వాజపుత్త్రుండును, ధనురాచార్యుండును, భార్గవరామునికడ ననేక దివ్యాస్త్ర ప్రయోగోపసంహారంబు లెఱింగిన వాఁడునగు ద్రోణాచార్యునికడ దివ్యాస్త్రంబులఁ బ్రయోగోపసంహార మంత్రములతోడ నిరవశేషముగ ధనుర్విద్యనంతయు నేర్చిరి. అందు నర్జునుండు కుశాగ్రబుద్ధియై యందఱకన్న మిన్నయై ధనుర్విద్యలో గురువునంతవాఁడయ్యెను.

# యౌవరాజ్యము

పాండవుల విద్యావినయ వివేకాదిసద్గుణపుంజమునం జేసియు, వారు నిరహంకారులగుట వలనను, ప్రకృతిజన మంతయుఁ, గురుపాండుకుమారులలో యుధిష్ఠిరుండు జ్యేష్ఠుండగుటను నాతని యౌవరాజ్యరమా పట్టభద్రుంజేయ వాంఛించుచుండిరి. ప్రభువున కుండవలసిన యన్ని గుణములుండుట వలనఁ బ్రజానురాగము గలవాఁడగుటను యుధిష్ఠిరు రాజ్యాధికార పదవియందుంచుట యర్హతమ మని భీష్మద్రోణ విదురాదులు తమలో నిశ్చయించుకొనిరి.

ధృతరాష్ట్రుం డది యెఱింగి యమాత్యప్రజానుమతంబున ధర్మవీరుండగు పాండవజ్యేష్ఠు నొక శుభముహూర్తమున యౌవరాజ్యపట్టభద్రుం గావించెను. యౌవరాజ్య పదవీ భాసమానుఁడై, ప్రజానందకరుండగు ధర్మాత్మజుని ధర్మబుద్ధికిని, సత్యరతికిని, భీమసేనాదుల బాహుబల సాహసౌదార్యాదులకును బ్రజలు మిగుల ననురక్తులై వారల సేవించుచుండిరి. వీరలిట్లు సకల జనానుమతులైయుండ ధార్తరాష్ట్రుల నేరును గౌరవ దృష్టితోఁ గాంచకుండిరి.

దుర్యోధనుఁడిద్దానికి మిగుల వగచి కర్ణ శకుని దుశ్శాసన ప్రభృతులతో మంతనంబుండి, కుతంత్రంబుఁజేసి ధృతరాష్ట్రుం గాంచి "తండ్రీ! పాండవు లమిత పరాక్రమధనులు వారింజూచి యేను మిగుల భయంపడుచుందును. యుధిష్ఠిరుఁడు యౌవరాజ్య పదవీ విరాజమానుఁడగుటఁ బ్రజావర్గమంతయు దేవేంద్రుని దేవతలట్లు కడుననురక్తులై గొల్చుచున్నారు. జాత్యంధుండవగు నీవుండగనే యాతనినందఱును గౌరవ రాజ్యసింహాసనాధిష్ఠితుంజేయుదురు. నీస్థితియే యిట్లున్న మాస్థితి వేఱ చెప్పవలయునే?" అని బహు విధముల వాపోయెను. మఱియు "అభిమానధనుఁడనగు నేను విరోధియౌన్నత్యంబు నెట్లు సైరింతును?

పాండవుల నెటకేని దూరప్రాంతముల కనుపు" మనియు వచించె.

అద్దానికి నాంబికేయుండు "కుమారా! ధర్మజుఁడు ధర్మాత్ముఁడు. గుణరత్నఖని. పాండురాజు నేనంధుండనైనను, నన్ను రాజ్యపదమున నుంచి నాయందు భక్తివినయంబులం బ్రవర్తించుచు దిగ్విజయంబొనర్చి, దేశంపుటెల్లల విస్తరింపఁజేసి, యనంత ధనరత్న రాశులంగొనివచ్చి, నాచే ననేక యజ్ఞంబులఁ జేయించెను. అట్టి పాండు భూజానిసుతులయెడఁ గృతమెఱుంగని వాఁడవై యెట్లు దూరప్రాంతమున కనుపుదు. ఇయ్యది కడుంగడు కిల్బిషహేతువు కాదా? ఇట్టి దుస్స్వభావంబును విడచి, యైకమత్యముకలవాఁడవై యుండు" మని హితముపదేశించెను.

దుర్యోధనుఁ డంతమాత్రముతో విడువక యెన్నియో విధముల "యుధిష్ఠిరుండురాజైనఁ బాండవేయుల బలపరాక్రమౌదార్యాది గుణంబులఁ బ్రకృతి జనంబులు వారి యంద, అనురక్తులైయుండు" రనియుఁ, "దమస్థితి మిగుల శోచనీయమగు" ననియు "నట్టి హీనస్థితిరాకముందె పాండవుల వారణావతమున కనుపు" మనియు బహుదీనముగా వేడి తండ్రి నొప్పించి, యాతనిచేఁ బాండవులు వారణావతమునకేగునట్లు చేయించెను. అందుఁ బాండవులు వసించుటకు నొక చక్కని లాక్షాగృహంబు నిర్మాణంబు సేయించెను. యుధిష్ఠిరాదులు జననీ సహితులై భీష్మాదుల యనుమతివడసి ప్రయాణోన్ముఖులైరి. నాఁడు దుర్బుద్ధియగు సుయోధనుండు పాండవులయెడ నతిభక్తి వినయ ప్రేమలఁ జూఁపెను. ప్రజాహితైకరతుండగు ధర్మసంభవునిఁ బౌర జానపదులు విడువలేక మిగుల వగచిరి. దుర్యోధనుండు తన యందును, దనసోదరులయందును విద్వేషా సూయలు గలిగి తమ్ము వంచించుటకుఁ బ్రయత్నించుచున్నాఁడని వినియు, ధర్మసూనుండు తమ్ముల కది యెఱింగింపలేదు. విదురుఁడు

ధర్మజాదుల సాగనంపుటకుఁ జాలదూరమువచ్చి, "దుర్యోధనుఁ దుర్బోధముచే నంధరాజు ప్రాణాపాయకరమగు నుపద్రవ మేదేనిఁ జేయింపక మానండు. మీర లేమఱక విషాగ్నులవలన బహుజాగరూకులై మెలంగుచుండుఁ" డని నుడివెను. కతిపయ ప్రయాణంబులఁ బాండవేయులు వారణావతంబుంజేరిరి. అటఁ బౌరసీమంతినీ జనంబు లున్నతసౌధంబులనెక్కి వీరినిఁ గన్నుల పండువుగాఁ గాంచిరి. ధృతరాష్ట్రునియోగంబునఁ బురోచనుండను శిల్పి దివ్యభవనంబొక్కండు వీరికై నిర్మించి యుంచెను.

శుభముహూర్తమున నందుఁబ్రవేశించి యుధిష్ఠిరుండు గృహమాజ్యతైల లాక్షామయమగుటఁ గడుంగడు జాగరూకులై యుండ ననుజుల కెఱింగించెను. భీముఁ డదివిని మిగులఁ గోపించి "యాగృహము నప్పుడే దహించి యెచట కేని యేగుద" మనిన ధర్మజుండు "తొందరపాటు తగ"దని హెచ్చరింప గడు జాగరూకులై మెలఁగుచుండిరి. విదురునిచేఁ బంపఁబడిన ఖనకుఁ డేతెంచి రాఁగల శ్రావణ కృష్ణ చతుర్దశీ దివసంబున నీగృహం బును బురోచనుం డగ్నితోఁ గాల్చు నని యెఱింగించి యెవ్వ రెఱుంగకుండఁ బాండవులు వెడలుట కొక్క బిలంబా లక్క యింటినుండి నిర్మించెను. నియమితదివసమునఁ, గుంతి విప్ర జనంబులఁ బూజించి మృష్టాన్న దక్షిణాదుల వారిం దృప్తులంజేసి యుత్సవంబుననుండ వీరింగని పెట్టి యుండుమని పురోచనుని పనుపుననున్న నిషాద వనితను సపుత్రక నత్యధిక మద్యపాన మత్తయై యొడలెఱుంగనిదాని, నందుంచి వాయు సూనుండు పురోచనుకంటె ముందుఁదానే యాగృహమున కగ్నియిడి సోదర, జననీ యుతుఁడై ఖనక వినిర్మితబిలమార్గంబునఁ జనియె. ఏ పురుసుతులును, నిషాదవనితయు, నత్యుగ్రపావక దగ్ధులైరి.

వారణావతంబు వారేవురు సుతులతోఁ గుంతియ మరణిం చెకాఁ దలంచి మిగుల వగచిరి. ఖనకుఁడు పాండవులు సురక్షితులై బిలమార్గంబున నేగిరని విదురున కెఱింగించి యాతని నానందింపఁజేసెను.

ధర్మస్వరూపులు నమానుషభుజాబలో పేతులగు పాండు నందనులు లాక్షాగృహంబున దగ్ధులగుట విని యాంబికేయుండా లఱచి నట్లఱచుచు నేడ్చె.

బిలంబు వెడలి వటవృక్షంబు క్రింద నతినిద్రాసక్తులై పయి పుట్టంబులంబఱచుకొని యొండొరులెఱుంగక పడియున్న ధర్మజాదు లంగాంచి వారిస్థితికిం బవమాననందనుండు మిగుల శోకించె.

"త్రిభువన సామ్రాజ్య శ్రీ
ప్రభుఁడగు ధర్మాత్మజుండు ప్రాకృతజను న
ట్లభి రూక్షతలంబున ని
ట్లభి భూతుండగునె నిద్ర నతిఖిన్నుండై."

అనుచు నర్ధరాత్రంబున భీముండతి నిద్రాసక్తులైన జననీ సోదరుల సంరక్షించుచుండ, హిడింబుండను పిశితాశ నుండు వీరిం జంపవచ్చిన వానిని బాహుయుద్ధంబున వధియించె. హిడిం బుని సోదరియగు హిడింబ భీముంజూచి వలచిన నాతండీయు మను నిరాకరింపఁజూచి ధర్మనందనుం డామెపైఁ గరుణించి యానాతి మనోరథంబు నీడేర్పుమని యానతిచ్చెను. యుధిష్ఠి రుండును గుంతియు మఱలమఱలఁ జెప్పుటచే భీముండు హిడిం బం బరిణయ మయ్యెను.

ఒక సంవత్సరకాలము వారందేయుండిరి. శాలిహోత్రుఁ డను మహర్షికడ వారనేక మంత్రముల నుపదేశమునందిరి. అవత్సరముననే హిడింబకు భీమునివలన ఘటోత్కచుండుద యించె. ఆహైడింబేయుండు బహు మాయాయుద్ధవిశారదుం డును, పరాక్రమమున భీమునట్టిఁడును నైయుండెను. "ఆపత్స మయములఁ దన్నుఁ దలంచు చుండునది" యని యాతండు పితరుల ముదలఁగొని యెటకేని జననీసహితుండై యరిగె.

వ్యాసభగవానుండే తెంచి పాండవులనోదార్చి భావి శుభ వర్తనంబు లెఱింగించి, "యేకచక్రపురిఁ గొంతకాలము సుఖ ముండుండని వచించి యంతర్హితుండయ్యె.

పిదప వారంపఱు నచటనుండి వెడలి బహుదేశ నదీ నదంబులంగడచి యేక చక్రపురింజేరి, లలితజటాకుశవల్కలా జినధారులై వేదపఠనం బొనర్చుచు, బ్రహ్మచర్యవృత్తి భిక్షము నెత్తుచు, నొక విప్రగృహంబున నుండిరి. చిరకాలమునుండి యేకచక్రపురవాసుల బాధించుచున్న యమునానదీ గహ్వర వాసియగు బకాసురు నవక్ర భుజావిక్రమంబునం బరిమార్చి వాయునందనుం డాయగ్రహారవాసులకు, నాదేశ వాసులకు నెనలేని మహోపకారంబొనర్చి వారి మన్న నలనందెను.

## ద్రౌపదీ వివాహము

పాంచాల దేశము నేలు పృషతుని సుతుఁడును, ద్రోణా చార్యుని సహాధ్యాయియునై యగ్నివేశుఁడను నాచార్యునికడ నస్త్ర విద్యలంగఱచి, పృషతుని పరోక్షంబునఁ బాంచాల రాజ్యసింహా సనము నధిష్ఠించి రాజ్య ధనమదాంధకారమునఁ గన్నులు గానక ద్రోణాచార్యుఁ దిరస్కరించి యాతని ప్రియ శిష్యుండగు నర్జు నునిచే నోడింపఁబడి గురుదక్షిణగా నర్పింపఁబడి యా యవ మానభరమున సంలజ్జితుండగు ద్రుపదుండు పరమేశ్వరు నగ్ని ముఖంబున నారాధించి యర్జును వివాహ మాడఁగల కన్యను, ద్రోణుంజంపఁగల కుమారునిఁ బడసెను. అక్కన్య పుట్టినయప్పు డయశరీరవాణి 'కృష్ణ' యని వచించె. ద్రుపదుని కూతురగుట ద్రౌపదియనం బ్రసిద్ధయయ్యె.

సంజాత యౌవనయైన కూతు నర్జునున కీయఁదలంపఁ బాండవులు లాక్షాగృహంబున దగ్ధులగుటవిని, ద్రుపదుండు మిగుల వగచి, మత్స్యయంత్ర ముంకువగా స్వయంవరంబుఁ జాటించె.

స్వయంవరమున కేగుచుండు ద్విజులవలన నాయుదం తంబువిని, ధర్మసూనుం డనుజులతో జననితోఁ బయనంబై యేగుచుండఁ గృష్ణద్వైపాయనుంగాంచి యందఱు నాతనికి నమస్కరింప నాతండు

"ధర్మ సుతుఁడున్న చోటను
ధర్మువునకు హాని గలదె ధారుణినైనన్,
ధర్మువ తాత్పర్యముగా
నిర్మలమతి నెగడునది వినీతాత్ములరై"

యాజ్ఞసేనీ జన్మప్రకారంబు సవిస్తరముగా వివరించి, స్వయంవరమునకు మీర లరుగునది మీకందుల శుభఁబగునని దీవించి యథేచ్ఛంజనియె. అప్పుడా పాండవు లనవరతంబు నహర్దివంబును బ్రయాణించుచుండ వారినొక్కయెడ నర్ధరాత్రంబున గంగాతీరంబున నంగారపర్ణుండను గంధర్వుండడ్డగించెను. వీని నర్జునుండోడించి, ధర్మజుని కడకుందెచ్చెను. ఇట్లు కొనితేఁబడిన యంగారపర్ణుం గరుణించి ధర్మసూనుండు విడచిపుచ్చెను. అట్లు ధర్మజునిచేఁ గరుణింపఁబడిన యంగారపర్ణుండ నేకపురాణేతిహాసంబులం బాండవులం బ్రబోధించి, పురోహిత మాహాత్మ్యంబు వచియించి వేదవిదు నొక్కనిఁ బురోహితుఁగా వరింపుమని నుడివె.

అప్పుడు ధర్మవేదులగు పాండుసూనులు ధర్మాధర్మ వేదియు, వేదవిదుఁడునగు ధౌమ్యునిఁ బురోహితుంగా వరియించిరి.

మఱునాడే పాంచాలరాజధానియగు కాంపిల్య నగరంబునకేగీ యందుఁ గుంభకార గృహంబున విడసి, నివుఱుఁగప్పిన నిప్పులువోలె బ్రాహ్మణవేష ధారులై ద్విజసమూహంబునఁ జేరి స్వయంవరమండపమున నుపవిష్టులై యుండిరి,

ఆ స్వయంవరోత్సవమునకు నానాదేశాగతులగు రాజపుత్త్రులస్త్రవిద్యాపారంగతు లసంఖ్యాకులు వచ్చియుండిరి. కౌరవులు, యాదవులు, జరాసంధాదులు మహాసంపద్వైభవమున స్వయంవర మండపమున కేతెంచి యర్హాసనముల నలంకరించి యుండిరి. ముందుగా దృష్టద్యుమ్నుండువచ్చి స్వయంవర నియమముల నువన్యసించెను. అతని వెను వెంటనే శుభ్రమాల్యాం

బరాభరణభూషితయై, సితపుష్ప మాలంగేలంగీలించి కుసుమా యుధుని సూనేతరంబగు సాయకంబోయన మోహనాంగియై పాంచాల రాజపుత్త్రి సఖులు గొలువవచ్చి నిలచెను. అట్టి పాంచాలి యనన్య కన్యకాజన సామాన్య లావణ్యమును, రాజకుమారులు నయనాంజలులఁ దనివితీరఁ గ్రోలుచుండిరి.

అట్టి సుందరాంగియగు నీరాజపుత్త్రినిఁ గాంచిన నితనికి నప్పు డాయమం బడయుఁ దలంపుగలుగదయ్యె. రాజకుమారు లొక్కరే మత్స్యయంత్రంబును గొట్టం బ్రయత్నించి వితథ మనోరథులై, లజ్జాభరావనమిత మస్తకులై స్వస్థానములంజేరిరి. కృష్ణుని యనుమతమున, యదువృష్ణి భోజాంధకులు సజ్యకర్మం బునం దనారబ్ధులై మిన్నకుండిరి. శిశుపాల, జరాసంధ, శల్య కర్ణులు క్రమముగా మాష, యవ, ముద్గ, రోమ మాత్రంబులు దక్క, మోపెట్ట నశక్యంబైన లజ్జితులై చనిరి.

యంత్రమును గొట్టు వేడుక యర్జునునకుఁ గలిగినది. ఆతండు శమనతనూజాతుని యనుమతి వేడ నాతఁడాశీర్వదించెను. అంతఁ బార్థుండు విప్రసమూహంబునుండి లేచి వింటిని సమీపించి, యాచార్యులకు నమస్కరించి, యేరాజపుత్త్రుఁడును మోపెట్టి కొట్టలేని మత్స్యయంత్రంబున శ్రమంబునఁ దెగవేసెను. వెంటనే యాజ్ఞసేని మందగమనయై బ్రాహ్మణ కుమార వేషంబున నున్న పార్థుని కంఠసీమ సితపుష్పక దామమున సవిలాసంబుగా నలంకరించెను ధర్మజుండు సంతోష వార్తఁ దెలుపుటకుఁ దల్లికడకుఁ గవలతో నేగుచుండెను. కర్ణాదివీరు లది చూడఁజాలక విప్రవేషంబుననున్న పాండవ మధ్యమునితోఁబోరి పరాజితులైరి.

ఆసమయముననే శ్రీకృష్ణుండు విజయలక్ష్మీ సనాథులగు పాండవుల నేవుర బలభద్రున కెఱింగించెను. పాండవేయులే వురు లాక్షాగృహదగ్ధులుగాక జీవించి యుండుటను జూచి, సంకర్షణుండు మిగుల సంతసించెను.

ధర్మజ, నకుల, సహదేవులు తల్లింజేరి యున్నంతనే భీమా ర్జునులు ద్రౌపది వెంటరా నరిగి కుంతింజేరి, "అమ్మా! మేమొక భిక్షందెచ్చితి" మని పలుక నాసాధ్వీలలామ "మీరేవు రద్దాని నుపయోగింపు" డని వచించె. తరువాత వారివెంట వచ్చిన భువ నత్రయ రాజ్యలక్ష్మియుంబోలెనున్న ద్రుపదరా జాత్మజంజూచి లజ్జించి యధర్మభీతయై "నేఁడేల నేనిట్టి యధర్మ వచనంబుఁ బలికితి. నావచనమెన్నండు నన్నృతంబు కాలేదే?" యని వగచు చుండెను. ధర్మజుం డాయమ నూఱడించి, ద్రౌపది నర్జునుఁడే వీర్య శుల్కగాఁ బడసెఁగాన నాతఁడే యానాతినిఁ బరిణయ మగుఁగాక, యనియె. "జ్యేష్ఠుండుండఁ గొండుకవాఁ డుద్వా హంబగుట ధర్మవిరుద్ధంబు కాన నగ్రజుండవగు నీవే పాంచాల రాజసుతను సవిధిగా వివాహమాడు" మని ఫల్గునుండు ధర్మ యుక్తంబుగా వచియించె. అయినను బాండు తనూజాతు లే వురును బాంచాలియందు బద్ధానురాగులైరి. విధి లిఖితమొక తీరుననుండ వేఱొక విధమెట్లగును?

అద్వితీయ శరసంధానచాతురి మత్స్యయంత్రంబుఁదెగ నేసి ద్రౌపదిచే వరింపఁబడిన వాఁడెట్టి వాఁడో కనుంగొనఁ బార్ష తుండు దృష్టద్యుమ్నునంపి తెలిసికొని వారి యాచార వ్యవహార, వర్తనాదులంబట్టి బ్రాహ్మణ క్షత్రియులలో నొక, జాతివారని నిశ్చయించుకొనెను. తరువాత నిక్కంబెఱుంగంగోరి పాంచాల పతి, చాతుర్వర్ణ్యోపయో గోచితంబులగు రథము లాయత్తపఱచి వారలం బిలువనంపఁగాఁ బాండవులేవురు క్షత్రియోచితములగు స్యందనంబు లధిష్ఠించి యేతెంచి సింహ కిశోరములువోలె నిశ్శం కముగా క్షత్రియార్హ సింహాసనంబుల నాసీనులైరి.

ద్రుపదుండు సబహుమానంబుగాఁ బ్రశ్నింప ధర్మజుండు తమ యథార్థస్థితి నెఱిఁగించెను. అందులకు ద్రుపదుండు మిగుల సంతసించి తనజన్మ ధన్యమయ్యెనని తలంచి 'విజ యుండు ద్రౌపదిని వివాహమాడుఁగాక' యని వచించెను.

అందులకు యుధిష్ఠిరుండు వేదవ్యాసుని వచనమునను, కుంతి యానతినిఁదలఁచి "యేమేవురమును నీపుత్త్రింబరిణయ మాడుదు" యనియె. అద్దానికిం బార్షతుండు కడుంగడు విస్మ యంపడి "ధర్మాత్ముండవును, నిత్యసత్య వచలుండవగు నీవిట్ల నఁదగునా! ఇయ్యది లోకవిరుద్ధంబుగాన ధర్మమాలోచింపు" మనియె. ఇట్లు ద్రుపదుండు డోలాందోళిత హృదయుండైయుండ నటకుఁ బారాశర్యుం డేతెంచి యాతనికిం దన తపః ప్రభావం బున దివ్యదృష్ఠినొసంగి పాండవులయు, ద్రౌపది యొక్కయుఁ బూర్వజన్మ వర్తనంబుం జూపించి "యీ యేవురును, ద్రౌపదిని వివాహమాడుట దైవనిర్ణీత విషయ" మని యాతని ధర్మసందేహ మునుఁదీర్చెను.

సాత్యవతేయుని యుపదేశ ప్రభావంబున, ధర్మజు వచ నంబున జ్యేష్ఠాను పూర్విగాఁ బాండవేయు లేవురుఁ బాంచాలిం బరిణయమాడి, యిష్టభోగంబు లనుభవించుచుఁ గొంతకాల మచటనేయుండిరి. అల్లుండ్రడందఱకు ద్రుపదుం డరణంబుల నసంఖ్యాకంబులగు వస్తువాహనాదుల నిచ్చెను. ద్రౌపది, భర్త లేవురకు, నత్తకు నతిభక్తితో నేమఱక శుశ్రూష లొనర్చు చుండెను.

## రా జ్యా లా భ ము

పాండుభూపాల నందనులు లాక్షాగృహమున దగ్ధులుగాక జీవించియుండి, మహా భుజాబలశాలియగు ద్రుపదునితో బాంధ వ్యంబు నందియుండుటయు యాదవపాంచాల పాండవులేక మైనఁ దమకు రాగల నాశము నాలోచించి దుర్యోధనాదులు, ధృతరాష్ట్రుడును మిగుల నుద్విగ్న మానసులైరి.

భీష్మ ద్రోణ విదురాదుల యుపదేశమున ధృతరాష్ట్ర మహీనాథుండు విదురునంపి, కుంతీ ద్రౌపదులతోఁ బాండు నంద నుల రావించి శ్రీకృష్ణుఁడు, కురువృద్ధుల సమక్షమున నర్ధరా

జ్యంబు వారికిచ్చి ఖాండవ ప్రస్థమున కనిచెను. శ్రీకృష్ణుని యాజ్ఞానుసార మింద్రుఁడు పంపఁగా వచ్చిన విశ్వకర్మ సకల శుభలక్షణ సమన్వితమగు నింద్రప్రస్థనగరంబు నిర్మించి యిచ్చెను. విశ్వకర్మ తన శిల్పకళా వైదగ్ధ్యమున నిర్మించిన, యింద్రప్రస్థమున కమరావతియు, నలకాపురంబును, భోగవతియు నీడుగావు.

ధర్మనందనుం డా నగరీలలామంబును, వృద్ధపురోహిత గురూపదిష్ట సుముహూర్తమునఁ దమ్ములతోఁ బ్రవేశించి, యాదిమరాజచరితుఁడై వర్ణాశ్రమాచార వ్యవహారములెడఁ గలుగకుండ ప్రాజ్యసామ్రాజ్యంబు సుపూజ్యంబుగా నేలుచుండెను. నారదోపదిష్టమార్గంబున ద్రౌపది పాండవుల కొక్కరికి నొకయేఁడు చొప్పునఁ బరిచరించుచు భార్యయైయుండెను, ధర్మజున్మనకు ద్రౌపది కాక స్వయంవర లబ్ధయగు 'దేవిక' యను భార్యయుంగలదు. ఈ జాయయందీతనికి యౌధేయుండను పుత్త్రుండు గలిగె. యుధిష్ఠిరునకు ద్రౌపదియందు జనించినవాఁడు ప్రతివింధ్యుఁడు

అర్జునుం డొకనాఁడు చోరహృతధేనూత్తనుఁడై యొక బ్రాహ్మణోత్తముఁడు వేడుకొంటకు రాఁగా ద్రౌపదీ ధర్మజులుండు కేళీమందిరమునకు నేఁగి యాయుధంబులంగొని, యేగిఁ చోరుల వధించి విప్రునకు ధేనువు నర్పించెను. నియమపాలనంబునకై ధనంజయుండు ధర్మజు ననుమతిఁ బడసి తీర్థయాత్రల కేఁగియనేకపుణ్యనదీనదములం గ్రుంకులిడి పుణ్యస్థలముల సందర్శించుచు నులూపి యను నాగకన్యను, పాండ్య దేశాధీశ్వరుని పుత్రియగు చిత్రాంగదను వివాహమాడి క్రమముగా నిరావంతుండు, బభ్రువాహనుండునను పుత్త్రులం గాంచెను. తపస్వివేషమున ద్వారకం బ్రవేశించి శ్రీకృష్ణు ననుమతిని బలభద్రుని పరోక్షంబున సుభద్రను వివాహమాడి యభిమన్యుండను పుత్రుం బడసెను.

## రాజ్యాంగ పద్ధతి, రాజనీతి

రాజ్యాంగనీతిజ్ఞుఁడగు ధర్మజుండు నూతన ప్రభుత్వమున రాజ్యాంగములఁ జక్కగా సంస్కరించి ప్రజానురంజకముగా రాజ్యతంత్రమును నడపెను. ధర్మార్థకామములకుఁ బరస్పర సాంకర్యము లేకుండ సేవించుచుండెను. రాఁగల దివసమున నొనర్పఁదగిన ధర్మనిర్ణయముల నతిజాకరూకుఁడై యపరరాత్ర మున నాలోచించుచుండెను. కఱవు కాటకములు గలుగకుండు టకై ప్రతియూరున ననేకతటాకముల పుష్పఫలోద్యానాదుల నిర్మాణముఁ జేయించెను. చారచక్షువై దీర్ఘదర్శియై ప్రజల కష్టసుఖముల నరయుచుండెను. చంపఁదగిన యట్టి శత్రువు నైనను 'శరణ' మన్నవానిని సంరక్షించు చుండెను. ప్రజాహిత సౌఖ్యకరములగు పనుల నాచరించుటలోఁ దన భోగసౌఖ్యముల లెక్కింపకుండెను.

ఇవియది యననేల? మంత్రులు, హితులు, పురోహితులు, యాజ్ఞికులు, సేనానాయకులు, వైద్యులు, కరగ్రాహకులు, సైని కులు మున్నగువారి నాదర్శపూరుషులు, స్వార్థ రహితులగు వారినే నియమించుచుండెను. ధర్మసంభవునిరాజ్య కాలమునఁ బ్రజలకు జారచోరకిరాతాదుల బాధ లేశమైనను లేకుండెను. బధిరపంగ్వంధబిక్షుకులకు నన్నపానములు నిత్యము లభించు టకుఁ దగిన సత్త్రవుల నేర్పఱచెను. వేయేల? అతని పరిపాల నావ్యవస్థ దిలీపమాంధాతృరఘుక్షితీశుల పరిపాలనను బోలి యుండెను.

ఖాండవదహనావసరమున నర్జునుచేఁ బ్రాణదానముఁబడ సిన మయుండను శిల్పాచార్యుండు కృతజ్ఞతాసూచకముగా ధర్మ జునకు ననిదంపూర్వము, సుందరము నగు నొక సభాభవనమును నిర్మించియిచ్చెను. అయ్యది మనోహరములగు నుపవనముల తోను, జలాశయములతోడను, బహువిరత్న నవరత్న కుట్టిమ

స్థలములతోడను, సుందర సువర్ణసాలభంజికా సహస్రంబుల తోడను, ఆద్వారంబున ద్వారం బున్నట్లును, ద్వారంబున్నయెడ నద్వారంబు నట్లును, స్థలంబున జలంబున్నట్లును, జలాశ యంబుగలచోట స్థలంబునట్లును విభ్రాంతిఁ గలిగించుచుండెను.

## రాజసూయము

యుధిష్ఠిరుం డొకపరి దివ్యసభను రత్నసింహాసనాసీనుండై యుండ మహర్షియగు నారదుండరుగుదెంచి ధర్మజునిచే యథా విధి నభ్యర్చితుండై ధర్మజుని సభం బొగడి రాజనీతి విశేషం బులు గొన్ని యడిగి హరిశ్చంద్రాదులు యాగంబులు సేసిరి. కాన నీవును నట్లే చేయుమని వచించె. మఱియు నది నిరంత రాయంబుగాఁ గొనసాగెనయేని శుభంబగునని నుడివెను. యాగ మొనర్చుట కిచ్ఛ గలిగియు, విఘ్నభయముతో వెనుదీయుచున్న పరేతరాట్సూనుని ధౌమ్యాదిపురోహితులుఁ దమ్ములుం బ్రోత్స హించిరి. అప్పు డాతండు కృష్ణు రావించి యాతని కా సంగతి యెఱింగింప నాతండు మిగుల సంతసించి, "పూరువంశతిలకా! జరాసంధాది రాజన్యుల జయించి రాజసూయం బొనర్ప నీవ వలంతివి. తప్పక రాజసూయం బొనర్చి శాశ్వతకీర్తిం బడయు" మని వచించి తాను భీమార్జునులం గూడి మాగధుని పట్టణం బగు గిరివ్రజంబున కరిగెను. జరాసంధు నెక్కటి కయ్యంబున వాయునందనుండు వధించెను భైరవపూజాబలికై మాగధుండు చెఱఁబట్టిన రాజపుత్త్రులఁ బలువుర శ్రీకృష్ణుండు విడచిపుచ్చెను. జరాసంధ పుత్త్రుండగు సహదేవుని మాగధసామ్రాజ్యపట్టభద్రుం జేసెను.

ధర్మజానుజులు చతుర్దిశల కరిగి నానాదేశాధీశుల సం గర రంగమున జయించి, యమూల్యవసురత్నకనక వస్తువాహ నాదులఁ గప్పములుగాఁ గొని వచ్చి ధర్మజున కర్పించిరి. యాగ మునకు ధృతరాష్ట్రాది కురుగురువృద్ధులు, దుర్యోధనాది కురు

కుమారులు, శిశుపాలాదులు, యదువృష్ణిభోజాంధకులు, మఱి యుఁ దక్కుఁగల రాజపుంగవులు పేర్మితో నేతెంచిరి.

స్నేహసంబంధులైన కృష్ణద్రుపదులు దక్కఁ దక్కిన రాజులెల్లరు ననేకోపాయనములం గొనితెచ్చి శమననందనున కర్పించిరి శైలకానన ద్వీపవిశాలమైన వసుమతీచక్ర మంతయు ధర్మజునకు స్వాధీన మయ్యెను. గౌడకాంభోజదేశాధీశులు నానా విధరత్నములను, శుకవర్ణ వాహములను, సింహళ కేరళ చోళ పాండ్యరాజ పుత్రులు విద్రుమద్రుమములను, ఏలాగురుచం దనములను భక్తితోఁ గొనివచ్చి యిచ్చిరి.

శుభముహూర్తమునఁ బెద్దల యాజ్ఞచే రాజసూయ మారం భింపఁబడెను. యుధిష్ఠిరుండు యజ్ఞదీక్షితుండై మూర్తీ భవించిన ధర్మువువోలె నుండెను. ఎందును లోపంబు లేకుండ నధ్వరంబు ప్రవర్తిల్లుచుండెను. ఒకలక్ష భూసురోత్తములు సంతృప్తిగా భుజించిన వెనుక నొక్కమాఱు తనకుఁదాన మ్రోయుశంఖ మయ్యధ్వరోత్సవంబు సన్నినాళ్లు విడువక మ్రోయుచుండెను. ద్రౌపది యజ్ఞసందర్శ నేచ్ఛఁ జనుదెంచిన వారిని బీద, సాద, ధనికుఁ డనక సమాదరంబునం బరిశీలించుచు, భోజనాదు లం దృప్తులం గావించి తరువాత నర్ధరాత్రంబునం దాను గుడుచు చుండెను.

అవభృథసమయంబున యజ్ఞదీక్షితులగు యాజ్ఞసేనీ ధర్మ జుల నారదపారాశర్యాదిమహర్షులు ధౌమ్యాదిమహీదివిజులు నశేషపుణ్యతీర్థ జలంబుల నభిషేకించిరి. ధర్మసూనుండు యా గాంతమున మహాసభయందుఁ "బూజార్హుండెవం" డని సురనదీ సూనుం బ్రశ్నింప నాతఁడు "కారణజన్ముండును, అమానుష ప్రభావసంపన్నుం డగు శ్రీకృష్ణుండ పూజనీయుఁ డతని నర్చిం చిన నెల్లరుఁబూజితు లగుదురు సందేహింపక నీ వాతని నర్చింపు" మన ధర్మజుండు సహదేవోపనీతం బగునర్ఘ్య మాల్యా నులేపనాదుల యజ్ఞభోక్తయగు గోవిందుం బూజించెను. అద్దాని

కందఱును సంతసించిరి. శ్రీకృష్ణుని మేనత్తయగు సాత్వతికి కుమారుఁడును, చేదిదేశాధీశ్వరుఁడగు శిశుపాలుండది సహింపక ధర్మజనదీసుతకృష్ణుల నెగ్గులాడుచు సదంబు వెల్వడి యుద్ధసన్నద్ధుండయ్యె. శాంతమూర్తియగు పాండవాగ్రజుండాతని ననేకవిధంబులఁ బట్టువఱచుచుండెను. దమఘోషనందనుండగు శిశుపాలుని వాక్పారుష్యము మితి మీఱుచుండెను. తుట్టతుదకు, దుష్టశిక్షకుండగు జనార్దనుండు చక్రధారచే శిశుపాలుని కంఠంబు నుత్తరించెను.

యాగము నిర్విఘ్నముగ నెఱవేఱెను. యాగమున కేతెంచిన రాజులు, ఋత్విజులు, మహర్షు లమూల్యాంబరాభరణాదులు, అగ్రహారములతో సత్కరింపఁబడి తమ నెలవులకుం జనిరి. దుర్యోధనాదులు మయసభావైభవముం గాంచుట కటనాగిరి. మయసభావైభవమును గాంచుచు దుర్యోధనుం డందు జలాశయంబును స్థలంబుగా, స్థలంబును జలాశయంబుగాఁ దలంచి తిరిగి, దాని నిర్మాణచాతురి నెఱుఁగఁ జాలక స్ఖలితగతియైయుండ భీమాదులు, ద్రౌపదియు నది చూచి నగిరి. ధర్మజుం డది యెఱింగి దుర్యోధను మనంబులోని కినుకం బాప భీమునిచే నమూల్యాంబరాభరణాదుల నిప్పించి, సత్కరించి యాతని ననిపెను. దుర్యోధనుండిట్లు ధర్మజుం డొనర్చిన యాదరసన్మానముల నవమానముగా భావించెను. పాండవేయుల సంపద్వైభవములు దుర్యోధనునకు నసూయాజనకము లయ్యెను.

అబలయగు పాంచాలి యట్లు నగుట మిగుల నాతనికిఁ గ్రోధకారణము, లజ్జాకరము నయ్యెను. అసూయాగ్నితో నాతఁ డట్టుడికిన ట్లుడికెను. కందుగల పసిఁడిఁ గాంచినఁ గంది వివర్ణమయినట్లు దుర్యోధనుని కాయము మనోవ్యథాహవ్యవాహదాహమున వివర్ణమయ్యెను.

ఇట్టి మేనల్లునిం గాంచి దుష్టబుద్ధియగు శకుని మాయాదురోదరవ్యాజమున భానుప్రభులగు పాండునందనుల లక్ష్మియెల్ల నే నపహరించి యిత్తు నని యూఱటం బలికెను.

దుష్టచతుష్టయ మనంబరగిన కర్ణశకునిదుర్యోధన దుశ్శా
సనులు ధృతరాష్ట్రున కీ సంగతినంతయు జెప్పి మాయాద్యూ
తమునకు ధర్మజుంబిలిపింప నా యంధరా జంగీకరించునట్లొ
నర్చిరి మయసభనుబోలు నొకసభను ధృతరాష్ట్రుండు దుర్యో
ధనప్రీత్యర్థమై, కనకఖచితస్తంభ సహస్రంబులను, విచిత్ర
ద్వారశతంబులను, వివిధరత్న రుచిరప్రదేశంబులనుంజేసి
రమ్యంబుగా శిల్పాచార్యుల రావించి నిర్మింపఁజేసెను.

అంధవిభుండు, ధర్మజునిఁ దోడ్తెచ్చుటకు విదురుం బం
పెను. సుహృద్ద్యూతవ్యాజంబునం బిలువంబడి రాకుండుట క్షత్ర
ధర్మంబుగామిఁ బాండవాగ్రజుండు సోదరులతో, ద్రౌపదితో
వారణావతంబున కరుదెంచెను.

## జూదము

దుర్యోధనుం డతిప్రియంబు నటించుచు, సల్లాపంబు
లాడుచు, "కాలక్షేపమునకు జూదమాడుటకు ధర్మజుర" మ్మని
యాహ్వానించెను. ఈ విధంబుగాఁ బిలువంబడియు జూదంబున
నగు దోసంబెఱింగియు, దైవానుశాసనంబున, భవితవ్యతా బలం
బున ధర్మనందనుం డక్షవిద్యానిపుణుండును, మాయావియునగు
సౌబలునితోనాడి యోడియు, నోడినకొలఁది పెచ్చు పెఱిఁగిన
మచ్చరంబున సర్వస్వంబును సర్వరాజ్యంబును, దమ్ములనుఁ
దుదకు ద్రౌపదిని గూడ నొడ్డి యోటు వడియెను

దుర్యోధనుఁ డీవిధంబుగ మాయాద్యూతంబునఁ బాండ
వుల వోడించుటయేకాక వారి నవమానింపఁ దలంచి ద్యూత
పరాజితయు, నేకవస్త్రయు, పరమసాధ్వియునగు పాంచాల రాజ
నందనను దుశ్శాసను నంపి రాజసూయాభృథంబునందు శుచియై
పెనుపొందిన వేణిపట్టి రాజసభ కీడ్పించెను. దురాలోచనాపరుం
డగు దుర్యోధనుం డంతతోఁ దనివిసనక పాండునందనుల
మఱియు నవమానింపఁ దలఁచి యాజ్ఞసేనీ వస్త్రాపహరణం

బొనర్చ దుశ్శాసనున కాజ్ఞయిచ్చెను. దుర్యోధనున కన్నివిధ ములనునుజుఁడు కాఁదగిన దుస్ససేనుండు లజ్జాసంశయములఁ ద్యజించి కురుగురువృద్ధులసమక్షముప ద్రుపద నందన వలువల విప్పఁబొడంగెను. పటుభుజావిక్రమసనాథులగు నాథు లున్నను బాంచాలి యనాథయై దీనావనపరతంత్రుండగు కృష్ణుం దలంచి యాతని యపారకృపచే మానసంరక్షణంబుం జేసికొనియె. దు ష్టుల దురుద్యోగంబు లెన్నఁటికిని సఫలము కావుగదా?

ధర్మజ ధర్మపాశబద్ధుఁడై సమీరణసూనుండు పాంచాలి యవ మానంబుఁ గాంచి యవిషహ్యారోషరూషితాత్ముఁడై "యిట్టి యకృ త్యం బొనర్చిన దుశ్శాసను నాయోధనంబున వక్షంబుఁ జీల్చి యసృక్పానం బొనర్తు" ననియు, "ద్రౌపదిని దనయూరుప్రదేశం బధిష్టింపు మని సన్నఁజేసిన దుర్యోధనుని యూరుభంగంబు గావించి సంహరింతు" ననియు విలయ సమయరుద్రాకారుఁడై సభాసదులు వెఱగంద భయదప్రతిజ్ఞలం గావించెను.

జగత్త్రయవిజయ చణభుజవీర్యమేదురులైన యను జన్ము లు గలిగియుండియు, ధర్మనందనుండు ధర్మపాశబద్ధుఁడై యన్ని యవమానములలో మిన్నయగు ధర్మపత్నీ పరాభవంబును గాం చుచుండియు నేమియుననక ప్రశాంతుండై సోదరుల విజృంభిం పనీయక యూరకుండెను. అహా! ఏమి ధర్మసూనుని ధర్మతత్ప రత? కాలజ్ఞత? దూరదృష్టి? ధృతరాష్ట్రుండు దుష్టులగు కుమా రుల భంగించి, సకలబాంధవహితంబు సేయం దలంచి, ద్రౌపదిని బొగడి యాయమకు వరదానంబు గావించి దుర్ద్యూతమున ధర్మ జుం డోడిన రాజ్యంబు సమగ్రంబుగా నాతని కిచ్చెను.

పాండు మహీనాథాత్మజులు పత్నీసమేతులై యింద్ర ప్రస్థ మున కేగిరి. కాని యింతలో దుర్యోధనుని దురాలోచనమున నం ధనృపతి "ధర్మజుని మఱల రమ్మని ప్రాతికామి నంపెను. విధి విధానంబు దుర్లంఘ్యము, దుర్జ్ఞేయము నగును. హస్తిపురి కేతెంచి

యనుద్యూతంబున నోడినవా రరణ్యంబున ద్వాదశవర్షంబులు, నొకయేఁ డజ్ఞాతవాసం బుండను పందెము చఱచి యోటువడెను. కష్టములం గుడువవలసిన కాలమున మంచి యూహలు జనిం చుట యరిది కదా? శపథంబుచొప్పున యుధిష్ఠిరుండు ద్రౌప దియు, ననుజన్ములు వెంటరా నరణ్యముల కేగెను. పౌరు లనే కులు, మహీసురులు ధర్మజునివెంట నరణ్యమునకు వచ్చిరి. తనవెంట నంటివచ్చిన యవనీసురుల నతిథుల ననేకులఁ బో షింపలేనుగదా యని ధర్మజుండు విచారపరీత చేతుఁడై మూర్ఛ నందెను. ధౌమ్యముని యుపదేశమున జగచ్చక్షువగు వనజబాం ధవు నారాధించి యాతని వరప్రసాదంబునఁ జతుర్విధాహారం బుల నక్షయంబుగా నుత్పాదించు నొక పాత్రను బడసెను. ద్రౌ పది యాపాత్రతో వండును. వండినది యున్నవా రందఱకు సరిపోవును.

ఒకపరి విదురుండు ధర్మజుని కడ కరుదెంచెను. ధర్మ జాదులు తమ యాయుధముల లాగికొన ధృతరాష్ట్రుఁ డనిపి యుండునని తలంచిరి. కాని వచ్చిన విదురుఁడు "ధృతరాష్ట్రుఁ డు వెడలఁగొట్టుటచే వచ్చితి" నని వచించి యందుండ నంధనృ పాలుని పనుపున సంజయుం డేతెంచి "విదురుని ధృతరాష్ట్రుండు పిలువంబంచె" నని వచించెను. అప్పుడు ధర్మసూనుండు విదు రుని "వృద్ధరాజు నుపచరించుచుండు" మని యాతని గజపురి కనిపెను.

ధర్మనందనుండు వనవాసమున నుండియుఁ, త్రిభువన రాజ్యముఁ బాలించు వడువున సంతోషనిబద్ధబుద్ధియై మహాత్ము లగు ఋషులవలన ననేకధర్మంబుల, మహాత్ముల చరితంబుల వినుచు సంతుష్టహృదయుఁడై యుండెను. ధీరులగువార లాపదల యందు వికారము నందరుగదా?

పాంచాలరాజనందనయు, వాయుసూనుండును "సమరం బున ధార్తరాష్ట్రుల జయించి రాజ్యము నందుటే క్షత్రియధర్మ

మని పలువిధముల వాదించిరి. కానియాదర్శ పూరుషుండగు ధర్మాత్మసంభవుం "డరణ్యావాసంబు, నజ్ఞాతవాసంబు ముగియు వఱకు నదీ తగ" దని వచియించి వారిని శాంతచిత్తులఁ గావించెను.

ఒకప్పుడు ధర్మజుండు విచారపరీత చేతస్కుఁడై యుం డగా వ్యాసుండేతెంచి యతని విచారంబునెఱింగి, యాతనికిఁ 'బ్రతిస్మృతి' యను విద్యనుపదేశించి, యీవిద్యను నీవర్జునున కుపదేశించి, యాతనిచే దేవతల నారాధింపించుము. అద్దాన దివ్యాస్త్రలాభం బాతనికిం గలుగును. వ్యాసోపదిష్టవిధానంబున నావిద్యను యుధిష్ఠిరుండర్జునున కుపదేశించెను. అతండా విద్య నంది, యింద్రకీల పర్వతంబున భక్తజనశంకరుండగు శంకరు నారాధింప నామహాదేవుం డాతని జపసత్త్వములఁ బరీక్షించియు కాని దివ్యాస్త్రము లీయఁగూడమి, మాయాకిరాత రూపంబున నే తెంచి సూకరనిమిత్తంబుగా నాతనితోఁబోరి యాతని యస్త్రవిద్యా కౌశలంబునకు సంతుష్టాంతరంగుఁడై యస్త్రరాజంబగు పాశు పతాస్త్రంబు నొసంగి యంతర్హితుండయ్యె.

పిదప నర్జునుండు మహేంద్రుని కోరికపై మహాబలవంతు లగు నివాతకవచుల సంహరించి యింద్రుని యర్ధసింహాసనంబు నధివసించి యమోఘాస్త్రముల నెన్నింటినో దేవతల యనుగ్రహ మునఁ బడసెను దివ్యాస్త్రలాభ ధన్యుండగు ధనం జయుంజూచి ధర్మనందనుండు మిగుల సంతసించెను. అరణ్యావాసమున నప్పుడప్పుడు తమకుఁగలిగిన యవస్థకు ధర్మసూతికి విచారము గలుగ, బృహదశ్వుఁడు, రోమశుఁడు, మార్కండేయుఁడు మున్న గు మహర్షులు పురాతన రాజర్షిచరితంబులు సెప్పి, వారును దైవ వశమున నట్లే యిడుమలం గుడిచి మఱల సుఖించిరని యాతని కుందువాపిరి.

## విజ్ఞానసంపద

ఒకదిన మాహార సంపాదనార్థ మరణ్యమునఁ గ్రుమ్మరు

చున్న వాయునందను నజగరం బొకండు పట్టు కొనియె. భీముఁడు దానిని విడిపించుకొని రాలేకపోయెను. భీముఁ డాలసించినం దులకు ధర్మజుండు తానే భీమునివెదకుచు నేఁగి యజగర ముచేఁ జుట్టఁబడియున్న యాతనిం గాంచి మిగుల వగచెను. ధర్మనందనుం డాపత్సమయములయందు భీముని నమ్మియుం డెను. అందుచే ధర్మజుండు విషాదవిచారాక్రాంతహృదయుండై యుండ నజగరము మనుష్యభాషణంబుల నిట్లనియె.

"ఇందువంశశేఖరా! నా ప్రశ్నంబుల కుత్తరం బొసఁగు దేని నీయనుజన్ముని విడతును. సరియగు నుత్తరంబు లిచ్చి నీ తమ్ముని( గాపాడుకొను" మన యుధిష్ఠిరుండు "యథాశక్తి నుత్త రింతును. నే నల్పజ్ఞుండను" ప్రశ్నల నడుగుమనియె.

అజ:- బ్రాహ్మణుఁడన నెట్టివాఁడు?

యుధి:- సత్యము, క్షమ, దమము, శౌచము, దయ, తపస్సు, దానమువీని నవలంబించువాఁడు.

అజ:- అతఁ డెఱుఁగఁదగిన విషయమేమి?

యుధి:- సుఖ దుఃఖముల విమోహము నొందకుండుటయే యాతఁ డెఱుఁగ దగినది.

అజ:- పరోపకారము, ప్రియము సేయుట, సత్యవచనము, అహింస ఈ నాల్గింటిలో నేదియుత్తమము?

యుధి:- అహింస.

మఱియు ననేకములగు నజగరప్రశ్నలకు ధర్మజుం డుత్తరమొసఁగెను. సరియైన యుత్తరములకు సంతసించి భీము నామహా పన్నగము విడచి శాపవిముక్తి నందెను.

అగస్త్యమహర్షి శాపమువలనఁ జంద్రవంశ్యుఁడగు నహు షుఁడీ యజగరమూర్తియై పవిత్రవర్తనుఁడగు ధర్మజుని దర్శన

సంభాషణములవలన శాపవిముక్తి నందెను. యుధిష్ఠిరుని విజ్ఞానవిశేషము నెఱుఁగుటకు మఱియొక్క సందర్భమును గలదు.

మఱియొకనాఁడు పాండవు లొక వనమునుండి మఱియొక వనమునకు నరుఁగుచుండఁ బిపాసార్దితులై యొక మహీరుహచ్ఛాయనాగిరి. దగ్గరనేనీరముండుటఁ జూచి సహదేవుఁ డరిగెను. ఆతం డెంతకును రాకుండుటచే నకులుండును, నకులుండును దడయుటచే నర్జునుండును, అర్జునుం డాలసించుటచే భీముండును, అతండును రా విలంబము సేయుటచే స్వయముగానే యుధిష్ఠిరుం డరిగి యొక సరోవరముపొంత మూర్ఛితులై పడియుండిన, మహాపరాక్రమతేజోనిధానులగు సోదరులం గాంచి మిగుల వందురెను. ఈ విధముగా ధర్మజుఁ డెన్నఁడును దుఃఖించి యెఱుఁగడు. వారట్లు పడియుండుటకుఁ గారణమును దెలిసి కొనలేక తానును జలమును గ్రోలుటకై సరోవరమున దిగియెను. అంతలో నొక భయంకరాకారుండగు యక్షుండు గాన్పించి. "నాప్రశ్నల కుత్తర మిచ్చి నీవీ నీరమును గ్రోలుము. లేదేని నీతమ్ముల గతి నీకునుఁ బట్టు" నని వచించె. అప్పుడు ధర్మజుండు ధీర గంభీరుఁడై నిలచి యిట్లుత్తరం బిచ్చెను.

ప్ర:— సూర్యునకాధార మేమి?

ఉ:— సత్యము.

ప్ర:— మనుజునకు సహాయపడున దేది?

ఉ:— ధైర్యము.

ప్ర:— దేనివలన మనుజుఁడు బుద్ధిమంతుఁ డగును?

ఉ:— బుధులను సేవించుచుండుట వలన.

ప్ర:— భూమికంటె గౌరవము గలదేది?

ఉ:— తల్లి.

ప్ర:— ఆకాశముకంటె పొడవైన దేది?

ఉ:— జనకుఁడు.

ప్ర:— వాయువుకంటే వేగము గలదేది?

ఉ:— మనస్సు.

ప్ర:— తృణముకంటె దట్టమగున దేది?

ఉ:— చింత.

ప్ర:— నిద్రించినను, కన్ను మూయనిదేది?

ఉ:— మీను.

ప్ర:— పుట్టియును ప్రాణములేని దేది?

ఉ:— గ్రుడ్డు.

ప్ర:— సుఖమున కాధారమేమి?

ఉ:— శీలము.

ప్ర:— నరున కాత్మ యెవరు?

ఉ:— కుమారుఁడు.

ప్ర:— నరునకు దైవికయైన చుట్ట మెవ్వరు?

ఉ:— భార్య.

ప్ర:— ఉత్తమధర్మ మేది?

ఉ:— అహింస.

మఱియు ననేకములగు నిట్టి ప్రశ్నలకు ధర్మజుఁడు యుక్తియుక్తముగా, ధర్మబద్ధముగాఁ బ్రత్యుత్పన్నమతియై యుత్తరముల నిచ్చెను. అప్పుడా యక్షుఁడు సంతసించి "నీ తమ్ములలో నొకని జీవింపఁజేయుదు వేడు" మనియె.

అందులకు ధర్మసంభవుండు "నకులుని బ్రతికింపు" మన నాయక్షుండు "నిరుపమాన బలపరాక్రమోపేతులగు భీమార్జునులఁ గోరక యీతని నేల కోరితి" వనగాఁ "గుంతి సంతానమున నేను జీవించియుంటిని. మాద్రిసంతానమునం దొక్కండు

మహాత్మా! జీవింపవలదే? యని ప్రార్థించెను. అప్పుడా యక్షుం
డాతని ధర్మశీలతకు విస్మయంపడి నలువురం బ్రతికించి యనేక
వరంబు లిచ్చి యాతని విజ్ఞానసంపదకు ధర్మబుద్ధికిని మిగుల
సంతుష్టుండై యంతర్హితుండయ్యె.

## శరణాగత త్రాణపరాయణత

ఒకపరి ద్వైతవనమున మునివేషధారులై కందమూల
ఫలాశనులగుచు వనవాసాయాసము నిస్తరించుచున్న పాండవు
లను ద్రౌపదిని దమ ప్రాజ్యరాజ్యలక్ష్మీవైభవముం జూపి పరిభ
వింపనెంచి దుర్యోధనుండు ఘోషయాత్రావ్యాజమున ధృత
రాష్ట్రుని యనుమతిం బడసి దుశ్శాసనాదికురుకుమారులు,
కర్ణాదివీరులు శుద్ధాంతకాంతలు వెంటరాఁ జతురంగబలము
లతో నరిగి, "పాండవులు నివసించు నాశ్రమమునకు సమీప
మున నుండు కాసారతీరమున విడియుటకై క్రీడాగారముల
నిర్మింపుఁ డని నిజపరిజనుల కాజ్ఞ యిచ్చెను. ఆ సరోవరము
చిత్రసేనుఁడను గంధర్వరాజునకుఁ గ్రీడార్థము నిర్మింపఁబడి
నది. గంధర్వరాజభటులకుఁ గౌరవసేనకుఁ గలహమై యది
ఘోరయుద్ధముగా మాఱెను. మహావీరులగు కర్ణాదులు సైతము
గంధర్వరాజు పరాక్రమధాటికి నాగలేకపోయిరి. గంధర్వపతి
దుర్యోధనుని సోదర, పుత్రయుతముగా బంధించి రథముపై
నిడుకొని యంబరమున కెగసెను. శుద్ధాంతవనితాజనమును
గూడఁ జెరబట్టెను.

దుర్యోధనుని పక్షమువారు కొందఱు ధర్మజునకీ వార్త
నెఱింగించిరి. భీముండు, "మనకుఁ జులకనయ్యె మన చేయు
పనియ గంధర్వపతులు తగ నొనర్చిరి. "అప్రయత్నముగ, ననా
యాసముగ మనకు జయము సమకూఱెను. ఎల్ల పాపకృత్య
ములకుఁ గారణభూతుండును నసత్యవచనుఁడును నగు దుర్యో
ధనుండు మన నవమానింపవచ్చితత్పాపఫలమందె" నని సంత

సించెను. అద్దానికి ధర్మవేది యగు ధర్మసూనుండు "వాయునందనా! ఇది పరుషభాషణంబులకు సమయంబే? ఒక్క వంశమున జనించినవారికి దాయభాగవిషయమున నభిప్రాయ భేదంబు జనింపవచ్చును. శరణాగతరక్షణంబు రాజమాత్రునకు ధర్మంబు," అని మఱియుననేకంబులగు ధర్మసూక్ష్మంబుల నెఱింగించి,

"కావరయ్య యనినఁ గరము దుర్బలుఁ డైన
బెనసి యోపినంత సేయుననిన
ఊరకుండునయ్య యుత్తమశూరుండు
దీన జనుల యున్న తెఱఁగుఁ జూచి"

"శరణంబని వచ్చిన భీ
కరశత్రువునైనఁ బ్రీతిఁ గావఁగవలయున్
గరుణాపరుల తెఱం గిది
యిరవుగ సరిగావు దీని కేధర్మంబుల్"

అని నొక్కి పలికి, బోధించి భీమార్జుననకుల సహదేవుల నంపెను. వారు గంధర్వుల నిర్జించి, దార, సోదర, పుత్ర మిత్ర, సేనాయుతముగా దుర్యోధను విడిపించి తెచ్చి ధర్మజుని ముందుఁ బడవేసిరి. అప్పుడు కరుణాళుఁడగు ధర్మసూతి,

"ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకు మన్నదీని కొండొక విషాదముఁ బొందకు మన్న," అనిబోధించి సన్మానించి దుర్యోధనుని సాగనంపెను.

ఒకపరి పాండవులేవురు తృణబిందు నాశ్రమంబునఁ బాంచాలిని ధౌమ్యసహితంబుగా నునిచి మృగయార్థంబుచనిన దుస్సలాపతియు, సింధుదేశాధీశ్వరుండగు జయద్రథుండు ద్రౌపదీరూప లావణ్యమోహితుఁడై కొనిచనిన వెనుకవచ్చి యాతని సేనాసహితంబుగా జయించియు, దుస్సలావైధవ్యంబు దలంచి ధర్మజుండు ప్రాణంబులతో విడచిపుచ్చెను.

## అజ్ఞాతవాసము

అందుననే ధర్మజుం డజాత శత్రువు. ద్వాదశవత్సరంబు లిట్లరణ్యావాసంబుసం గడపి, యక్షుం డిచ్చిన వరప్రభావం బునఁ బాండవేయు లేవురు, ద్రౌపదియు నాకారంబుల మార్చి కొని, తమతమ యాయుధంబులం గళేబరమట్లు కట్టి, యొక్క శమీవృక్షంబున నునిచి యొకరొకరే మత్స్యధరణీనాథుని నగ రంబుం బ్రవేశించిరి. ధర్మజుండు సన్యాసి వేషంబునఁగంకుం డను పేరితో విరాటునకుం బురాణేతిహాసంబులఁ జదివి వినిపిం చుచు, జూదమాడుచుఁ, గాలక్షేపంబు సేయుచుండెను. వీలుగ ఇగి నప్పుడెల్ల దనవారిని గలిసికొనుచుండెను. భీమాదులును దమకుం దగిన యభిధేయంబుల బను లొనర్చుచు విరటునిం గొలుచుచుండిరి.

కీచకుండు ద్రౌపదీలావణ్యామోహితుండై యానాతినవమానిం పఁబోయినపుడు శార్దూలంబు వెన్నంటి వచ్చిన హరిణరమణివోలె మేనెల్ల వడంక భయార్తయై యానాతివిరటుసభం బ్రవేశించి, "శస్త్రాస్త్రసంచయంబుల నొప్పారి, దుర్దమప్రతిభటమర్దనక్రీడమై నుతివడసిన గంధర్వులేవురు పతులుండియు నొకఁడు నన్నిటు భంగపఱుపంగం జూచుచుండి" రని నుడువ, ధర్మజుండు గూడ ప్రకారంబుగా ధర్మయుక్తి ద్రౌపదిని నివారించెను. భీముఁ డపుడే కీచకుని సంహరింపనుంకింపయుధిష్ఠిరుండు తమగూఢవర్తనంబు బయల్పడునని యాతనిని నిగూఢంబుగా వారించి, పాంచాలరాజ నందనను "సభవీడిపొ" మ్మని వచించెను.

దుష్టవర్తనుండగు దుర్యోధనుం డజ్ఞాతవాసమున నున్న పాండుమహీనాథాత్మజుల బయల్పరుప బహుదుష్ప్రయత్నంబు లొనర్చెను. కౌంతేయులు విరాటనగరంబున నున్నట్లు కీచకవధా దుల వలన నెఱింగి వారిని వెల్లడి సేసిన సమయభంగంబగుడు ధర్మజుండు మఱలఁ ద్రయోదశవర్షంబు లరణ్యాంబులపాల

గును. రాజ్యంబు తనకే దక్కునని తలంచి, త్రిగర్తదేశాధీశ్వరుండగు సుశర్మను, దక్షిణప్రాంతమునున్న విరాటుని గోగణంబులఁ బట్టఁబంపెను. విరాటుం డది యెఱింగి నగరంబునంగల యోధు లందఱతోఁ బశుగణంబుల విడిపింపఁ జనియెను. బృహన్నల (అర్జునుని అజ్ఞాతవాసములో పేరు) యొక్కండు దక్క కంకుండును దన తమ్ములతో విరటునకుం దోడ్పడ నరిగె. సంగరరంగమున సుశర్మచేతం జిక్కిన విరటునిఁ గృతజ్ఞతాసూచకంబుగ గూఢంబుగా ధర్మజునియోగంబున భీముండు విడిపించి గోగణంబును మఱలునట్లుఁ జేసెను.

ఉత్తరగోగ్రహణమునకై కౌరవులందఱు వచ్చి పసులం బట్టిరి. నగరమున యోధు లెవ్వరునులేమి బృహన్నలాసారధియై యుత్తరకుమారుండు చని, కౌరవవాహినీసమర సంరంభోత్సాహముం గాంచి రథంబు డిగి పలాయితుండగుడు బృహన్నల యాతనిం బట్టితెచ్చి యుత్తరుని సారాధిగా నొనర్చి, తాను రథియై యజ్ఞాతవాసకాలంబు ముగియుటం దమ్మెఱింగించి, శమీవృక్ష నిక్షిప్తంబులగు నాయుధంబులం గొని భీష్మద్రోణకర్ణాది కౌరవ వీరులం గెలిచి పశుగణంబు మఱల్చెను.

మత్స్యధరానాధుండు, చారులవలన కుమారుని విజయం బెఱింగి, యదినిజంబకాఁ దలంచి, పురంబున నుత్తరు విజయంబుఁ జాటఁబంచె. కంకుం డా విజయంబు "బృహన్నలాస్ఫురితభూజాబలంబుననే కల్గె" నని ముమ్మాఱు నొక్కిపలికెను. అద్దానికిం గినిసి, విరటుండు "పేడిగడన యుడుగుమన్నుడుగ" వనుచు, సారెఁగొని వ్రేసె. ఇట్లు వ్రేటువడియుఁ బాండవాగ్రజుండు గినియఁడయ్యె. గంటిపడియె. గాయమునుండి రక్తము స్రవించుచుండ సైరంధ్రి శోణితబిందువులు క్రిందఁ బడకుండ నద్దెను. విరటుం "డప్లేల యద్దెద" వని ప్రశ్నింప, రాజా! ఉత్తమవంశమున జనించి పరమ పవిత్రుఁడైన యీతని రక్తబిందువు లెన్ని యీ భూమిపైఁబడు నన్నివర్షము లా దేశ

మున ననావృష్టియగుననియు నుత్తమద్విజలోహిత పాతం బరిష్ట దాయకంబనియు నాయమ వచించెను. ఉత్తరుఁడు బృహన్న లయు విజయలక్ష్మీసనాథులై విరాటకంకు లున్న తావున కేతెం చిరి. ధర్మజుని మొగము గంటిని జూచి కారణంబుఁదెలిసి యుత్తరుండు మిగులభయవినయంబులు పెనంగొన "ధర్మాత్ముఁ డగు నీతనికి నిట్లొనర్తురా? ఆమహాత్ముని క్షమింపుమని వేడి కొను" మనియె.

రాత్రి యందఱు నొకచో గూఢంబుగాఁగూడి మఱునాడు చేయఁదగిన కృత్యంబుల నిర్ణయించి యుదయంబునఁ బాండు నందనులు రాజ తనయానుగుణోజ్జ్వల వేషములఁ దాల్చి, పం చాగ్నులో యన విరటుసభం జేరిరి. ధర్మతనూ జాతుండు విరా టుని సింహాసనము నధిష్ఠించెను. మత్స్యధరా పాలుం డది కాంచి, "యిదేమి కంకభట్టా? శంకలేక నా గద్దియపై పదిలం బుగఁ గూర్చుండె" దని యడిగెను. అర్జునుం డప్పుడు,

రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య
సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోరాశి రాజు, ధర్మ
రాజ సుమ్ము మత్స్యావనీరమణ యితఁడు.

అజాతశత్రుఁడు విద్యాబల తేజముల వాసవుసింహాసన మేని యెక్క నర్హుఁడు. ఈచిఱుతగద్దియకును దగడే"! యని యెఱింగించి భీమాదుల వేఱువేఱ యెఱింగించెను. అర్జునుని భీమసేనుండెఱింగించెను. విస్మయ, భయా - దరావిష్ట హృద యుఁడై విరాటుండు పాండవాగ్రజన్ముని శరణం బందెను. రాజ్యమంతయు మీ బాహుబలంబున లభించినదగుట మీది మీ కర్పించుటలో విశేషమేమి కలదు? అని తన యుత్తరా పుత్రిని ధర్మనందనునకర్పించి "యీయమ నర్జునుండు వరించుఁగాక" యనియె. తాను విద్యోపదేష్ట యగుట ధర్మజాను జుండగు నర్జు నుం "డభిమన్యుకుమారుం డికన్యను బరిణయ మాడుఁగాక"

యని ధర్మబద్ధంబుగఁ బలికె. ధర్మనందనుం డర్జునుని యుచితజ్ఞతకు మిగుల సమ్మోదంబు నందె. కృష్ణబలరామాదు లజ్ఞాతవాసంబుఁ దరించిన పాండునందనులఁ జూడవచ్చిరి.

ఉత్తరాభిమన్యుల వివాహం బతివైభవంబుగాఁ బ్రవర్తిల్లెను. అభిమన్యు వివాహంబున కరుదెంచిన బలరామకృష్ణ సాత్యకులు, ద్రుపదుఁడుమున్నగువారును బాండవులు ముందు చేయవలసిన కార్య విధానమునుగూర్చి తర్కించిరి. ద్రుపద పురోహితుని సంధికొఱకు ధృతరాష్ట్రునికడకుం బంపిరి. ధృతరాష్ట్రుని పనుపున సంజయుండు రాయబారమునుగొని ధర్మజునికడకు వచ్చెను.

"కౌరవులు పాలీయకున్నను శాంతచిత్తులగు మీరు యుద్ధమును గోరక భిక్షావృత్తి నేని యరణ్యంబుల నుండుట మంచిది" యని సంజయుండు వలికెను. మఱియుఁ "గురురాజు నొద్ద అవినీతులు, నీతిమంతులు, సత్త్వసంపన్నులు, దురహంకారులు నిం కను ననేక ప్రకారములవారుఁగలరు. వారి మాటలేల? నీవు శాంతచిత్తుఁడవై యుండుటమే" లని యనేకవిధముల శుష్కసంధివాక్యములనొడివెను. ధర్మజుండు మొగమోటలేక సంజయునితో మాటలాడెను. "ఏమియులేక సంధి యేరీతిగఁ గుదురును. అధర్మమగు యుద్ధమును మాని, శాంతము వహించుట ధర్మమంటివి. కొన్ని కార్యములు ధర్మమువోలె నుండి, విచారింప నధర్మములగును. కొన్ని యధర్మముల వలెనుండి విచారింప ధర్మములగును. నేనొనర్చునది ధర్మమో యధర్మమో నీవే నిర్ణయింపుము. కోపోపశమనము అహింస యనునవి యుత్తమ ధర్మములె కాని వంశదూషకులు పాపాత్ములగువారిని నిర్మూలించుట క్షత్రియులకు ధర్మమే యని పెద్దల ముఖంబున విందు. యుద్ధము క్షత్రియ ధర్మమగునో కాదో నీవే నిర్ణయింపుము. అయినను ధర్మాధర్మముల నిర్ణయింప శ్రీకృష్ణభగవానుండుండ నే నెంతవాఁడను" అని బహు రీతుల ధర్మజుండు సంజయునితోఁ బలికె. ఈ విధంబుగా సంజయరాయబారంబు నిష్ఫలంబయ్యె. మఱల

ధర్మజుని పక్షమున గృష్ణభగవానుండు సంధికొఱకు నరిగెను. కృష్ణుండొనర్చిన హితోపదేశ మంతయు దుర్యోధనునెడ భస్మ హోమ మయ్యెను. మూర్ఖునకు నొనర్చిన హితోపదేశము వ్యర్థము కదా?

## యుద్ధము

ఇరుపక్షములవారును యుద్ధప్రయత్నములం జేయఁ బూనిరి. అనేకదేశాధీశు లుభయపక్షములం జేరుచుండిరి. కౌరవ సేన పదునొకం డక్షౌహిణులు. పాండవసేన యేఁడక్షౌహిణులు. నకులసహదేవుల మేనమామయగు శల్యుండు వనవాసాజ్ఞాతవాసముల నిస్తరించిన యుధిష్ఠిరుం బరామర్శింప వచ్చుచుండి దుర్యోధనుని కపటోపాయంబునఁ గౌరవపక్షముం జేరవలసినవాఁడయ్యెను. నిరాయుధుఁడై యుద్ధమొనర్పని దామోదరు నర్జునుండు "దనకు సారథియై మార్గదర్శియై సాయపడు" మని కోరెను. పదివేల గోపాలురను, సమరవిద్యా విశారదులను దుర్యోధనుండు కృష్ణునివలన సాయంబు వడసి తన్ను ధన్యుంగాఁ దలంచెను. బలభద్రుం డుభయులకు నే నొక్కరూప కాన నెవ్వరిపక్షము వహింపనని తీర్థయాత్రల కరిగెను. పుణ్యక్షేత్రం బగు కురుక్షేత్రంబు యుద్ధభూమిగా నిర్ణీతమయ్యె. అట నుభయ పక్షవాహినులను గయ్యమునకుఁ గాలుఁద్రవ్వుచు నిలుచుండెను. పాండవుల పక్షమున ధృష్టద్యుమ్నుడు సర్వసేనాపతి యయ్యెను. కౌరవుల పక్షమున మందాకినీనందనుండు సర్వసేనాధ్యక్షుం డయ్యెను.

యుద్ధరంగమున నర్జునుండు, గురు, పితామహసోదరాది బంధువర్గంబులం జంపిన గాని తమకు విజయము లభింపదు. అందుచే విషణ్ణచిత్తుఁడై శస్త్రాస్త్రములవిడి, క్షత్రియధర్మమును మఱచియుండ భగవానుఁడును, బార్థసారథియు నగు శ్రీకృష్ణుండు గీతోపదేశము సేసి యాతని మోహము వాపి స్మృతిఁ

గలిగించి సమరసముత్సాహిఁగా నొనర్చెను. ఆ యుద్ధగ్రంథమే ప్రాక్పశ్చిమఖండముల బహుభాషావేత్తలచే, బహుమతానుయాయులచే సాదరముగాఁ బఠింపఁబడు భగవద్గీత.

దుర్యోధనాదుల కశుభసూచకముగాఁ బయోవాహములు రుధిరమును, శిలలను వర్షించెను. మఱియునిఁక నెన్నియో యమంగళశకునంబు లుప్పతిల్లె. యుద్ధారంభమున యుధిష్ఠిరుండు పాదచారియై, తమ్ములును, శ్రీకృష్ణుండును, దుర్యోధనాదులును విస్మయంపడుచుండ గురుభీష్మాదిమాన్యులకడ కరిగి, వారికి వందనం బొనర్చి, వారివలన శుభాశిషముల నంది వచ్చెను.

ఉభయసైన్యములకును, యుద్ధ మారంభమయ్యెను. భీష్ముండు తనబలంబు నశింపకుండ నెదిరిబలంబు నుక్కడగించుచు, గ్రీష్మర్తు మధ్యందినమార్తాండబింబంబుఁ బురుడించుచు, ధర్మజాదులకు విజయమునెడ నిరాశ జనించున ట్లొనర్చుచుండెను. కృష్ణార్జును లితనకి ధైర్యోత్సాహంబు గలుగఁజేయుచుండిరి. కాని మందాకినీనందనుని పరాక్రమధాటికాగలేక పాండవసేనలు చెల్లాచెద రగుచుండ, నర్జునుండు నిర్విణ్ణుండై చూచుచుండ శ్రీకృష్ణుం డాయుధంబుఁ బట్టనని శపథం బొనర్చియుండియు, రెండుమాఱులు సుదర్శనంబు ధరింపవలసినవాఁ డయ్యెను. భీష్ముని యుసహ్యాపరాక్రమహవ్యవాహమునఁబడి పాండవసేనలోని వీరాధివీరులు శలభాయమాను లగుచుండిరి. వరుసగా నవక్రవిక్రమంబున భీష్ముం డిట్లు తొమ్మిది దివసములు యుద్ధ మొనర్చెను. తొమ్మిదవనాటియుద్ధమున భీష్మ దుర్నిరీక్ష్య శరనిపుణతకుఁ బాండవసేనలు చెల్లాచెదరయ్యెను. నాటి రాత్రి నిరాశోపహతుఁడై ధర్మజుండు శ్రీకృష్ణుని యుపదేశమున భీష్ముని కడకుంబోయి నమస్కరింప నతం డాశీర్వదించి "వచ్చిన పనిఁ జెప్పు" మనియె. అప్పుడు కౌంతేయాగ్రజుండు, "పితామహా! మాకు యుద్ధంబున జయంబు లభించు నుపాయం బెఱిఁగింపు"

మనియె. స్వార్థత్యాగియగు నాశాంతనవుండు "నేనుశస్త్రాస్త్రధారినై యుద్ధంబు సేయుచుండు నంతవఱకు మీకు జయంబు లభింపదు. స్త్రీని, ఆయుధహీనుని, స్త్రీనామధారిని, ఉష్ణీషహీనుని, భాతృహీనుని, అపత్యహీనుని, పుట్టినప్పుడు స్త్రీయైయుండి నడుమ పురుషుఁడుగా మాఱినవాని నెదిరించి యుద్ధముచేయను. అందుచే స్త్రీపూర్వుండగు శిఖండిని ముందుంచుకొని యర్జునుండు పోరెనేని నేను పరాఙ్ముఖుండ నయ్యెద. నన్నప్పు డస్త్రశమంబునఁ బడవేయవచ్చు" నని తనవధోపాయంబు ధర్మజున కెఱింగించెను. ఆహా! మహాత్ములు ధర్మపక్షపాతులు గదా? పదియవనాటి యుద్ధమున నట్లే యొనర్చి యర్జునుండు భీష్ము బడవేసెను. శాంతనవుండు స్వచ్ఛందమరణుండు గాన శరతల్పగతుండయ్యె. అప్పుడును గాంగేయుండు కురువంశహితకారియై దుర్యోధనుంజీరి ధర్మజాదులకుం బాలిచ్చి హతశేషుల రక్షించుకొని సుఖంబుండు" మనియె. దురభిమాని ప్రాణావసాన సమయముననేని సజ్జనోపదేశమును వినునా?

భీష్మునిపదంపడి ధనురాచార్యుండు సర్వసైన్యాధ్యక్షుండయ్యె. ద్రోణుండు దనకు సర్వసైన్యాధిపత్య మిచ్చినందులకుఁ బ్రతిఫలంబుగా దుర్యోధనునొక్క వరంబుఁ గోరుకొనుమనియె. దుర్యోధనుండును, "ధర్మజుని జీవగ్రాహముగాఁ బట్టియి" మ్మనెను. అస్త్రవిద్యాచార్యుం "డాతనిఁ బట్టియిచ్చిన నేమిసేయుదు" వనఁ గౌరవ్యుండు "ధర్మజుని జూదంబునకుం బురికొల్పి, యాడించి, యోడించి యావజ్జీవ మరణ్యముల ననుజులతోనుండు నట్లొనర్తు" ననియె. ఆహా! దుర్లోభ మెట్టి దుర్బుద్ధులం గలిగింపదు! అప్పుడు ద్రోణుం డర్జునుండు ధర్మజుని కడలేకుండెనేనిఁ బట్టియిత్తు" ననియె. అర్జునుం డా ప్రతిని విని, తానున్నంతవఱ కాతనిం బట్టనీయ ననియె.

రణరంగమున యుధిష్ఠిరుండు పోరుచుండినను, భీమార్జును లంత యెక్కుడుగాఁ బోరలేదు. మఱియు ధర్మజుని సం

గక్షణముకొఱకై కొందఱు యోధులు పాండవశిబిరమున నెప్పుడు నుండుచుండువారు.

ద్రోణాచార్యుండు ప్రళయసమయ రుద్రాకారుఁడై మహాఘోరంబుగాఁ బోరుచుండెను. ద్రోణునిమూఁడవనాటి యుద్ధమున సంశప్తకులతో నర్జునుండు వేఱుచోటం బోరుచుండుటచే నాచార్యుండు దుర్భేద్యం బగు పద్మవ్యూహముం బన్నెను.

పాండవవరూధినిలో నప్పుడా వ్యూహంబు భేదింపఁ జాలినవాఁ డభిమన్యుం డొక్కండు దక్క నెవ్వరు లేకుండిరి. ఆతనికిని, నా మొగ్గరంబులోనం బ్రవేశించి బయటకువచ్చు నేర్పు లేదు. ధర్మజుండు "నీవు మొగ్గరంబు భేదించిన నీవెనువెంట నే మందఱమువచ్చి సాయపడుదు"మని చెప్పెను. సౌభద్రుండు తమ్మిమొగ్గరంబు భేదించి లోనం బ్రవేశించి వీరాధివీరులఁ బలువుర నొప్పించి నుఱుమాడుచుండెను. ధర్మజ భీమాదులు లోనం బ్రవేశింపనుంకింప నీశ్వరవరప్రసాదలబ్ధోరు భుజాబలుండగు సైంధవుం డడ్డగించి యొక్క యడుగేని లోనం బ్రవేశింపనీయఁడయ్యె. ఏకాకియై లోనఁ బ్రవేశించిన బీభత్సుని పుత్రుండు పలువురు ధనుర్ధరుల స్రుక్కించి, మ్రగ్గించి కపటోపాయమునఁ గర్ణాదిమహాయోధు లొక్కపెటఁ గవిసి తన్ను విరథుంజేయ దుర్యోధనపుత్త్రుం జంపి, దుశ్శాసనపుత్త్రుతోఁ బోరి యాతనిం బరిమార్చి తానును మడిసెను.

హరి మేనయల్లుఁ డిట్లు మరణించినందులకు ధర్మతనూజాతునకుఁ గల్గిన విచారమునకు మేరలేదు. వేదవ్యాసుండును, నారదుండును వచ్చిమృత్యుదేవతా ప్రభావంబును, మఱియు ననేకోపాఖ్యానంబుల నుద్బోధించి, యాతని పుత్త్రశోకం బపనయించిరి. అర్జునుం డావార్త విని సంవర్త సమయ సమవర్తి సమాకారుఁడై మఱునాఁటి సాయంతనమునకు సైంధవుం జంప శపథంబొనర్చి, యాచార్యాది బహువీర పరిరక్షితుఁడగు సైంధవుఁ గృష్ణోపదిష్ట విధానంబునఁ బరిమార్చెను.

ధర్మజుండస్త్ర గురునితో మొదటిదినమునను, నాల్గవదిన మునను రణంబొనరించి, యాతనిధాటికోర్వలేక మఱలెను. ద్రోణాచార్యుండు దుర్నిరీక్ష్యప్రతాపశాలియై సంగరరంగమున వాఱియమ్ముల ద్రుపదవిరాటులఁ గూలనేసెను. మాయా యుద్ధ నిపుణుండగు హైడింబుని ఏకవీరఘాతియగు, మహేంద్రదత్తం బగుశక్తిచేఁ గానీనుండుమడియించె. దుర్యోధనుం డతిపరుష భాషణంబులాడ ద్రోణాచార్యుం డతిశయితసురాసుర పరాక్ర మోపేతుఁడై యరివీరులకుఁ జూడ నరిదియై యజాత శత్రుని సేనానివహంబుల నురుమాడుచుండెను. అతని నుపాయంబున కాక పరాక్రమ బలమున గెల్చుట దుస్సాధ్యమని జనార్దనుండు గ్రహించెను. "అతని యేకైకపుత్త్రుం డశ్వత్థామ చంపఁబడియె" నని పల్కుమని యర్జునునకుఁ గృష్ణుండుసెప్పె. అర్జునుండది గురుద్రోహం బగుట నిష్టపడడయ్యె. భీమునిచే నశ్వత్థామ యను నొక భద్రదంతావళంబు మడిసియుండె. భీముండేగి చెప్పెన గురుండు విశ్వసింపక యజాతశత్రు నడిగె. అతండు ధర్మశంకి తుండై యుండఁ గృష్ణభీములచేఁ "ప్రాణరక్షణసమయంబున నసత్యదోషంబులేదు. ద్రోణునిబారినుండి మమ్మునందఱఁ గాకుం డం గాపాడు," మని ప్రబోధింపఁబడి అనృత భయము, అజి జయము వేధింపఁగా-

"వలయుకొలఁది నెలుం గెత్తి పర్షసమితి
యచ్చుపడగ నశ్వత్థామ సచ్చె ననియె
నని పదంపడి యల్లన నతని చెవికి
వినఁగ రాకుండ కుంజర మనియె"

ధర్మజునినోట నీమాట విని ద్రోణుండు పుత్రశోకంబున నస్త్రసన్యాసంబుసేసి తేజోమయాత్ముఁడై తనువు విడచెను. అప్పు ణ్యపురుషుండు ప్రకటజ్యోతీరూపంబున నెగసి పరమస్థానంబున కుం జనియె. ద్రుపదునందనుం డాతని, సర్వరాజకుమారాస్త్ర గురుని సైనికులు, సాత్యకిప్రభృతులు వారించుచున్నను దద్వ

ధార్థంబ జనించినవాఁ డగుట నతికివైచెను. ద్రోణుని యనంతరము భార్గవరామశిష్యుం డగు రాధేయుండు సర్వసేనాపతి యయ్యె.

దుర్యోధనుం డీతనినే కార్యమునకు ఖడ్గమునకు నమ్మియుండెను. స్వామిహితైక ప్రవీణుం డగు కర్ణుండొడలుదాపక శత్రుసేనల నుఱుమాడుచుండెను. కర్ణుని మొదటి దినము యుద్ధమునాఁడే యుధిష్ఠిరుండు సుయోధనునితో ద్వంద్వయుద్ధ మొనర్చి యాతని విరథుఁజేసెను. కర్ణాదులు సాయపడిరి. మఱల దుర్యోధనుండు డీకొన నాతని మూర్ఛిల్లఁజేసెను.

రెండవనాటి యుద్ధమునఁ గర్ణునకు శల్యుండు సారథి యయ్యె. ధర్మజువచనంబులం దలంచి మద్రపతి కర్ణుం బలు తీరుల నిరుత్సాహపఱిచెను. కాని సహజధీర గంభీరుఁడగు దివాకరసూనుండు విలయసమయసమవర్తి వితంబునఁ బాండునందనుల సేనల వాడియమ్ముల నొంచి చించి చెండాడుచుండెను. అర్జునుండు వేఱుచోట యుద్ధ మొనర్చుచుండెను. ధర్మజుని పలునారసమ్ముల నొనేసి వెన్నాడి ములుకులువోని పలుకుల నిష్ఠురములాడి కుంతికిఁ దానిచ్చిన వరమునఁ జంపక విడచెను. అర్జునుండు యుద్ధముఁ జాలించి కృష్ణునితోఁగూడి యగ్రజుఁ బరామర్శింప శిబిరమున కేగెను. పరాభవానలతప్తుం డగు ధర్మజుండు కిరీటి కర్ణునిం గడతేర్చి వచ్చెఁగదా యని యాతని స్తుతియించె. అంగరాజు చావలేదని యాతని ముఖంబుననే విని మిగులఁ బరుషంబులాడెను. "అర్జునా! కర్ణునకు నేనోడితినని యేమి? నీవును నోడితివి. భీమ, నకుల, సహదేవులు మున్నే యోడిరి. మనతోఁగూడి, కంసమర్దియు నోడెను. అశక్తుల మగుమన మరణ్యముల మునివృత్తి నుండుదము. నేఁ డభిమన్యుఁడేని, ఘటోత్కచుండేని యున్న నే నిట్టి పరాభవంబు నందియుందునా? కృష్ణుఁ డుండగా నేటికి భయంపడితివి? ని గాండీవం బెరవుగ నాతనికి" మ్మని కినిసి, పలికెను. తన గాండీవ

మితరుల కిమ్మని పలికినవాని మూర్ధంబుఁ దెగవేయ నర్జునుండు ప్రతినవట్టియుండె. అట్టితరి నఘటిత ఘటనాపటిష్ఠుండగు వాసుదేవుం డిరువురకును, ధర్మసూక్ష్మంబు లెఱింగించి ప్రశాంత క్రోధమత్సరులం గావించెను. మఱియు, "ధర్మనందనా? పుణ్యపురుషుండ వగు నీ వలిగిన యప్పుడే రాధేయుండు దెగియంగాఁ దలంపు" మని యాతని నూరార్చి, పార్థుం గూడి కృష్ణుండు రణావని కరిగె. కర్ణదుర్యోధనాదులు గాంచుచుండ భీముండు దుస్ససేనుం జంపి వాని యురంబు వ్రచ్చియసృక్పానంబొనర్చెను. నానాదివ్యాస్త్రవేదియు, మహాయోధుం డగు కానీనుం డర్జునునిచే యుద్ధరంగమునఁ గూలెను.

అప్పుడు కృష్ణుండు యుధిష్ఠిరుం గాంచి

"భువనము లన్నియు నొక్కటఁ
గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగా నోపునె? భూ
ధన భవదీయక్రోధా
గ్నివిహతుఁడై కాగెఁ గాక నిక్కం బరయన్"

అని సల్లాపంబు లాడె. ధర్మజుండును, సకలధరణీవలయ సామ్రాజ్యంబున కేను భర్తనైతి నని యానందించెను.

కర్ణుని తరువాత శల్యుఁడు సర్వసేనాధ్యక్షుం డయ్యెను. భీమశల్యులు గదాయుద్ధ మొనర్చిరి. శల్యునితో నెక్కువగాఁ బోరినది ధర్మనందనుండే వీ రిరువురును, మహాభీషణాస్త్రశస్త్రముల హెూరాహెూరిగాఁ బోరిరి. ఫాలలోచనుండు భక్తికి సంతుష్టుండై యొసఁగిన యమోఘశక్తిచే యుధిష్ఠిరుండు శల్యుం బంచత్వంబునొందించె. శల్యు చుట్టంబు లందఱుఁజుట్టు ముట్ట ధర్మనందనుండు వారి నందఱ వధించెను.

భ్రాతృ, పుత్ర, మిత్రమరణంబున నిరాశోపహతుండై దుర్యోధనుండు జలస్తంభనవిద్యాప్రభావంబున ద్వైపాయన హ్రదంబున దాగియుండ ధర్మజుం డాజాడ నెఱింగి వానిని

యుద్ధంబునకుం బిలిచెను. అభిమానధనుం డగు నాధార్త రాష్ట్రా గ్రజుండు, సిళ్లు చూపిన మత్తశుండాలంబు చెన్నున హ్రాదంబు వెల్వడి యుద్ధసన్నద్ధుం డయ్యె. భీమదుర్యోధను లరువురు, చిత్ర విచిత్రరీతుల గదాయుద్ధంబు ఘోరంబుగా నొనర్చిరి. అందు దుర్యోధనుండు తొడలు విఱిగి పడియె. ఉభయపక్షముల పుత్ర పౌత్ర, బంధు, మిత్రాదు లందఱు మరణించియుంట విజయో త్సాహ మావంతయేనియు, ధర్మనందనునకుఁ గలుఁగదయ్యెను.

భగ్నోరుఁడై పడియున్న సుయోధను కడకుఁ గృపాశ్వత్థామ లేతెంచి, మిగుల శోకించిరి. దుర్యోధను నభీష్టముందీర్ప నాచార్య సుతుం డపాండవం బొనర్పం బ్రతినం బూని యీశ్వరుం గూర్చి, నిశ్చలతపంబొనర్చి, యాతఁ డొసంగిన ఖడ్గంబు ధరియించి, నిశీధ సమయంబునఁ బాండవశిబిరంబులం జేరి నిద్రాసక్తులఁ బిన్న పాపలగు ద్రౌపదీసుతుల నేవురను, ధృష్టద్యుమ్నాది పాంచాల కుమారుల, మఱియు ననేకుల, గజాశ్వపదాతులను మాఱట మిత్తియో యన నురుమాడెను. సర్వజ్ఞుండును, జగన్నాటక సూత్రధారియు నగు శ్రీకృష్ణుం డానాఁడు పాండవుల నేవుర నాశిబిరంబుల నుండనీయక వేఱుచోట నునిచె. అహా? భగవం తుని లీల లద్భుతములు గదా! అశ్వత్థామువలనఁ బాండవులే వురుఁ గృష్ణనాత్యకులును దక్క మిగిలినవారంవఱు మడిసిరని విని దుర్యోధనుండు సంతసించి యసువులం బాసెను. దుర్మత్స రుండుతాను భీకరమృత్యుదేవతా కరాళదంష్ట్రామధ్యగతుం డయ్యును బరాపకారంబుఁ జేయఁ గోరుగదా?

తమపుత్రులందఱు నశ్వత్థామచే మరణించుటచే, ధర్మ జుండు మిగుల వగచెను. పుత్రమరణదుఃఖితయైన ద్రౌపది యశ్వత్థామం జంపుమని కోరియు, నాచార్యపత్నిం దలంచి, సదయహృదయయై యాతని శిరోరత్నమును బుచ్చికొని, ప్రాణ ములతో విడచిపుచ్చెను. భారతవీరనారీమణి పుత్త్రఘాతుకునిఁ గరుణించి విడచుట యుత్తమ దయాత్యాగములకు నిదర్శ నము గదా!

తరువాత యుధిష్ఠిరుండు ధృతరాష్ట్రుని దర్శింపనేగెను. అతండు ధర్మజుం గౌగిలించుకొని, 'భీముఁడేడి?' యని యడిగెను. త్రికాలవేత్తయగు శ్రీకృష్ణునిచే నిర్మితంబగు, నయోమయ భీమరూపంబుం జూప దాని నాలింగనంబు సేసికొని యాంబికేయుండు చూర్ణంబుఁ జేసివైచెను. అంధనృపతి దుర్బుద్ధికిఁ గృష్ణుం డాతని నిందించెను. అతండును, జనార్దను క్షమింపుమని వేడెను.

ధర్మజుండు గాంధారికి నమస్కరింప నామె పుత్రశోకాతురయై శపింప నుంకింప వేదవ్యాసుం డేతెంచి "యీతండు నిరపరాధుండు, ధర్మపరుండు శపింపకు" మని యోదార్చెను.

పతివ్రతామతల్లియగు, గాంధారి సుతభ్రాతృజామాతృ ప్రభృతి బంధుశిరశిఖామణుల కళేబరంబులం గాంచి మిగుల వగచి, "కృష్ణా? నీవు సర్వసమర్థుండవై యుండియు, నుభయ పక్షములవారికి సంధిసేయక యందఱు మరణించున ట్లొనర్చితివి. గావున నీవంశమువా రెల్లరు స్వయూథకలహంబుతో దుర్మరణంబు నొందుదురు గాక. నీవును దిక్కుమాలిన కుత్సితంపు చావునందుదువు గాక. మీ వధూజనంబులును, పతులును, సుతులును, బంధులును బనివిపనివి యిట్లెయేడ్తురుగాక" యని శపించె. కారణజన్ముం దగు మాధవుం డాశాపంబును మందహాససుందరవదనుఁడై గ్రహించెను. పాండ వేయులు కుంతీదేవిని గాంచి యాయము యాశిషంబుల నందిరి. ధర్మజుండు ధౌమ్యాదులచే యథావిధిగా దుర్యోధనాదుల కగ్ని సంస్కారంబులు నెఱవేర్పించెను. ధృతరాష్ట్రుని, స్త్రీజనంబుల దోడ్కొని మందాకినికిం జని, స్నానదానాదు లొనర్పించి యాహవమృతులగు వీరుల కందఱకు నుదకదానంబులఁ జేయించెను. అట్టితఱిఁ గుంతి "కర్ణుండు తనకు గన్యాత్వంబున సూర్య వరప్రసాదమున జనించినవాఁడు గాన నాకుఁ బుత్రుఁడును, మీకు సోదరుఁడు నగు నాతనికిఁ దిలోదకమ్ములి" మ్మని వచించెను.

అట్టి మహాపరాక్రమశాలియు, వదాన్యశిరోమణియు నగు కర్ణుని వధించినందులకుఁ బాండవు లందఱు మిగుల వగచిరి. ధర్మ జుండు "తల్లీ? అట్టి మహాబలశాలియగు కర్ణు నిన్ని దినంబులు కొంగున నగ్ని దాచిన ట్లేవిధముగా దాచితివి. స్త్రీల కిప్పటినుం డియు రహస్యంబు రక్షించు శక్తి లేకుండుఁగాక" యని శపిం చెను. విషాద, విచారపూరితస్వాంతుఁడై కర్ణునకు గోత్రనామంబు లుచ్చరించి తిలోదకంబు లిచ్చెను. మార్తాండ నందనుని యవ రోధపథూజనంబులం బిలిపించి వారి సన్మానించి యాతనికై యనేకభూరిదక్షిణల నొసంగెను. అందఱును హస్తిపురి కరు దెంచిరి.

## పట్టాభిషేకము

శ్రీకృష్ణుండు యుధిష్ఠిరాదులంగూడి, శరతల్పగతుండగు శాంతనవుని సన్నిధి కేగి, ధర్మజుని విజయంబు వచించి, పట్టా భిషేకంబున కాతని యనుజ్ఞ వేడెను. 'ధర్మయుక్తముగాఁ బ్రజావర్గమును బాలింపు" మని యాతండు ధర్మజుని దీవిం చెను. పిమ్మట వామదేవధౌమ్యాధి పురోహితవర్గము, నారదాది మహర్షులు వేదవిహితకర్మలు నడుప, ధృతరాష్ట్ర, విదుర, కృపా చార్యాదిసమక్షంబున, యుధిష్ఠిరుండు పట్టాభిషిక్తుండయ్యె. ప్ర కృతివర్గం బంతయు మిగుల నలరె. ధర్మజుండు, గాంధారీ, ధృతరాష్ట్రులఁ బితృనిర్విశేషముగా నాదరభావమున నరయు చుండెను. శ్రీకృష్ణుని యుపదేశమున ధర్మనందనుండు శరతల్ప గతుండగు గాంగేయుని వలన ననేక ధర్మంబుల వినియెను.

శాంతనవుం డేఁబదియాఱు దివసంబులు, యుద్ధనీతి, వర్ణాశ్రమాచారధర్మములు, యాగము, గురుజనము, సత్యాహిం సలు, కర్మము, పరమాత్మ, ఇంద్రియనిగ్రహము, కామము అజ్ఞా నము, యోగము, దైవపౌరుషములు, తృష్ణా, దుశ్శీలములు, తీర్థ సేవ, అసమకన్యాదానము, రహస్యము, సతీవ్రతము, దానము,

విద్యాదానము, సాధుసేవమున్నగు వివిధవిషయముల నెఱిం గించి యాతని కమూల్యావిజ్ఞానవికాసాదులం గలిగించెను. భార తీయేతిహాసమున కా ధర్మము లొరవడిఁవ్రాలు. స్వచ్ఛందమర ణుఁడును జితేంద్రియుఁడును ధర్మమునకై గురువుతో సైతము యుద్ధముచేసి విజయముం గాంచి దివిజులు, మహర్షులచేఁబ్రస్తు తింపఁబడిన గాంగేయుం డుత్తరాయణము రాఁగా మాఘశుద్ధైకా దశినాఁడు పరమపదము నందెను. ధృతరాష్ట్రుం డాతనికిం బార లౌకికక్రియల నొనర్చెను. ధర్మజుఁడు భీష్మబోధిత ధర్మమార్గ మున రాజ్యమేలుచు నశ్వమేధం బొనర్చెను.

ధృతరాష్ట్రుండు వానప్రస్థాశ్రమమున నుండఁగోరి యతి కష్టముగా ధర్మజుననుమతిఁబడసి, కుంతీ, గాంధారీ విదురసం జయసహితుఁడై యరణ్యంబున కేగి ఘోరతపంబొనర్చి గంగా ద్వారంబున కేగివచ్చుచుఁ గార్చిచ్చునం బడి మరణించెను. అందులకు మిగుల వగచి వారి కందఱకుఁ బితృకర్మల ధర్మ జుండొనర్చెను. మఱికొంతకాలము ధర్మజుండు ప్రజాక్షేమంబె తనక్షేమంబుగాఁ దలంచి రాజ్యమేలెను. గాంధారీ, మునిశాప ములవలన, యాదవులందఱు మదిరాపానమత్తులైరెండు పక్షము లుగాఁజీలి యొకరినొకరుఁ గొట్టుకొని మడిసిరి. సంకర్షణుండు తపముననుండి యవతారంబుఁ జాలించెను. యోగనిద్రాసక్తుం డును, భగవంతుండునగు హృషీకేశుండుకిరాతబాణక్షతి వ్యాజ మున లీలామానుషదేహంబుఁ జాలించివైకుంఠుండయ్యె. శ్రీకృ ష్ణునిపనుపున నర్జునుండు యాదవాంగవలఁ గరిపురమునకుఁ దోడ్తెచ్చెను, అర్జునునివలన శ్రీకృష్ణనిర్యాణంబువిని ధర్మజుండు మిగులవిషణ్ణుండై శ్రీకృష్ణపరిత్యక్తంబగు ధరాతలంబున నుండ నొల్లక యభిమన్యు కుమారుండగు పరీక్షితునకుం బట్టంబుగట్టి ధృతరాష్ట్రపుత్త్రుండగుయుయుత్సుని సేనాపతిఁగా నొనర్చెను. విరక్తచిత్తులగుపాండవు లేవురు ద్రౌపదియు నొకశుభముహూర్త మునను త్తరాభిముఖులై చనిరి.

# స్వర్గారోహణము

యుధిష్ఠిరాదు లైదుగురును, ద్రౌపదియు నుత్తరాభి ముఖులై యరుగుచుండ వారి నొక శ్వాన మనుసరించెను. అనేక మహానదీనదములను బుణ్యతీర్థములను స్నానమాడుచు, హిమవత్పర్వతమునుగూడ నతిక్రమించి మేరుపర్వతమును జేరిరి. అచట సిద్ధర్షు లెందఱో తపం బొనర్చుచుండిరి. వారి నేరిం జూడక యాపర్వతము నెక్కసాగిరి. ఇట్లుఁ గొంతదూర మేగువఱకు ద్రౌపది యోగభంగ మగుడుఁ గ్రిందం బడియె. భీమసేనుం డది కాంచి "మహాసాధ్వి యగు నామె యట్లుం బడుటకుఁ గారణ మేమి" యని యుధిష్ఠిరు నడిగెను. "భర్త లందఱు నొకవిధమైనను ధనంజయునందు నెక్కుఁడు పక్షపాతంబుఁ బూని యుండెడిది. ఆదోషమున నీయమకిట్టి యవస్థ తటస్థించె" ననియె. మఱికొంతసేపటికి సహదేవుండు పడిపోవ భీముండాసంగతి యగ్రజునకుఁ దెల్పి కారణం బడుగ "నీతండు తన కంటె నెక్కువ విజ్ఞానము గలవాఁడు లేఁడని యహంకరించుచుండు. గాన నితం డిట్టి యవస్థనందె" ననియె. తరువాత నకులుండుఁ బడిపోయెను. వాయుసూనుండు కారణంబడుగ "నీతండు రూపంబునఁ దనకు నెవ్వండును, సాటిలేఁడని గర్వించుచుండును. ఆహేతువున నిట్లయ్యె" నని వచియించి నిలువక వెనుఁ జూడక యరుగుచుండె. మఱికొంతసేపటికి నర్జునుండు విగతాసుండై పడిపోయె. "అన్నా! అర్జునుం డేదోషంబున నిట్లయ్యె" నని భీముం డడుగ నచంచలుండై ధర్మనందనుండు, "ఈతండు కౌరవసేననెల్ల నొక్క దివసమున సమయింతు నని వచియించి యట్లు సేయఁడయ్యె. మఱియుఁ దనవంటి విలుకాఁడు లేఁడని గర్వించుచుండును. అందుచే నిట్లయ్యె" నని నుడివె.

ధర్మజుండు శునకసహాయుండై యరుగుచునే యుండెను. మఱికొంతసేపునకు భీముండును బడిపోవుచు "అన్నా? నేనేమి యపరాధంబుల నొనర్చితి" ననెను. "వాయునందనా? నీవు

మిగుల భోజనప్రియుండవు. అహంకారమున, నందఱఁ దూల నాడుచుందువు. ఆదోషమున నిట్లైతి" వని యాతనికై నిరీక్షింపక యేగుచుండెను. శునకమాత్రసహాయుండై మేరుగిరిశిఖరంబు నెక్కుచుండెను.

ఇంతలో నింద్రుండు విమానారూఢుఁడై వచ్చి యిద్దేవ విమానంబునెక్కి నాతో స్వర్గమునకు రమ్మనియెను. యుధిష్ఠిరుం "డట్లయిన మాపురమునుండి నన్నువిడువక యనుగమించి వచ్చు శునకంబును వీడి రాననియు నట్లు విడచి వచ్చుట మహా పాప మనియు" నొడివెను. "అస్పృశ్యంబగు శునకము నాకలో కమునకు రాఁదగ" దని యింద్రుండు వచింప "నేనిచటన యుండి నిన్నుఁగూర్చి తపంబొనర్చెద, దీనిని విడనాడిరాఁజాల ననియు" వచించె. ఈతని విశుద్ధభావంబును గ్రహియించి, శ్వాన రూపమున నున్న ధర్మదేవత యగు యముండు నిజరూపంబును దాల్చి "వత్సా"

ఇంతటి పెంపుగల్గుట మహేంద్రుడు నీదెసఁ గాంచె నీవుని
శ్చింతత మేనితోఁ జనుము, సిద్ధపథంబునఁ బుణ్యలోకముల్
వింతలు గాకయుండఁ బృథివీవర? నీకు సుదార సౌఖ్య మ
త్యంతము నవ్యయంబునగు, నందలి మాన్యులు సంస్తుతింపగన్

ధర్మజుం డింద్రలోకంబున కరిగెను. అందు దుర్యోధ నాదుల నసూయామాత్సర్యవిరహితుల నాకలోకసుఖముల నను భవించువారిం గాంచెను. భీమార్జున కర్ణాదు లచటఁ గానరారైరి. వారిం జూడ ధర్మజుండు గోర బాకశాసనుండు వారల్పదోష లగుటచే నరకమున నుంట వారిం గానిపింప నారదాది మహా మునుల కాతని నప్పగించెను. అమ్మహర్షు లీమిషచే ధనురా చార్యుం గూల్చు సందర్భమున నాడిన యసత్యదోషంబునకు నరకమునకుం గొంపోయిరి. అటవారు కర్ణార్జునాదులం జూపిరి. దుర్యోధనాదులు స్వర్గమున నుండుటయుఁ, గర్ణాదులు నరక ముననుంటకుం జింతింపఁగా "మొదటఁ గష్టపడిన వారు పిదప

సుఖింతు" రనియా మహర్షు లాతనీ కుందు వాపిరి. అప్పుడు పాకశాసనుం డేతెంచి "ఉదారవర్తనా? 'రాజ్యాంతే నరకం ధ్రువమ్' అనునానుడి నీవు ధర్మాత్ముండ వగుట నరకలోకంబు దర్శించితి. నిరస్త పాపుండ వైతివి" అనెను. ధర్ముండజాత శత్రుని నాకాశగంగలో స్నానముఁ జేయించెను. అప్పుడే ధర్మ వీరుండగు యుధిష్ఠిరుండు దేవతాత్వంబు నంది స్వర్గమున కేగి భీష్మాదివీరుల, నభిమన్యుప్రభృతి కుమారులం గాంచెను.

సోదరప్రేమ, వృద్ధజనోపసేవ, ఆర్తత్రాణ పరాయణత్వము, విజ్ఞానవిశేషము, ధర్మానురక్తి, సాధుపోషణము దుష్ట శిక్షణము, క్షమాదయా శౌచములకు ధర్మవీరుఁడగు యుధిష్ఠిరుని చరిత మాదర్శప్రాయము.



# రుద్రమదేవి

## 1

ప్రతిజాతికి స్వచరిత్రజ్ఞాన మావశ్యకము. ప్రాచీనౌన్నత్య వైభవ. సంస్మరణము, జాతి కావేశోత్సాహములఁ బుట్టించి, జాతీయపురోభివృద్ధికి, నౌన్నత్య సంపాదనమునకు సాధనమగును ఆంధ్రజాతి బహుప్రాచీనమైనది. క్రీస్తువునకుఁ బూర్వము రమా రమి, 3, 4 వందల యేండ్లనాఁడే యాంధ్రులు సువ్యవస్థితమైన రాజ్యాంగ సేనాంగములు గల సామ్రాజ్యము గలిగిన పరాక్ర మోపేతులుగాఁ బరిగణింపఁబడియుండిరి. ఉజ్జ్వలమగు చరిత్ర గల జాతికి మహోజ్జ్వల మగు భవిష్యత్తుండును. దేశభక్తికిఁ, బరాక్రమధనులగు మహాపురుషులయు, నాదర్శ వర్తనులయు నుదార చరిత్రలకును నవినాభావసంబంధ మున్నదని పెద్దల మతము.

అట్టి యాంధ్రరాజ్యరమాధురంధరులగు రాజన్మతారహార ములోఁ గాకతిసార్వభౌములు నాయకమణుల వంటివారు. కాక తీయను దేవతకు భక్తులై యుండుటచే నీవంశమువారిని గాకతీ యులని యందఱుఁ బిలచుచుండిరి. ఈవంశమువారు చంద్ర వంశ్యులనియుఁ జెప్పఁబడియున్నది. ఈవంశమువాఁడగు నందుఁ డను రాజచంద్రుఁడు శ్రీశైలక్షేత్రమున కరిగి యందు సిద్ధోప దేశమునఁ దపంబొనర్చెను. ఒకయోగిని యాతనిధైర్య సాహస ములకు మెచ్చి ఖడ్గఖేటములను యోగవాగములను బ్రసాదిం చినదఁట, ఆయోగవాగములచే జనార్దనస్వామి నారాధింప నా స్వామి నందుని బోనీకనిల్పి నృసింహరూపంబుఁ దాల్చి ప్రత్య క్షంబైనంత నందుఁడును జెక్కుచెదరక నిలిచియుండ స్వామి సంతోషించి శస్త్రము లొసంగెను ఈ నంద మహారాజునకు విజ యపాలుఁడు, విజయపాలునకు యశస్కాముండగు సోమదేవుఁడు

జనించెను. ఈ రాజన్యునకు సిరియాలదేవియందు మాధవవర్మ జనించెను. కటక వల్లభుఁడగు బల్లహుండు బలుమాఱులు దండెత్తివచ్చి సోమదేవుని సంగ్రామరంగమునఁ జంపియుండెను. మాధవవర్మ యనుమకొండలోఁ బెరిగి పెద్ద వాఁడై విద్యాబుద్ధులం గఱచి పితృఘాతుకుఁడగు బల్లహు నోడించెను. ఈతండు మిగుల న్యాయదీక్ష, అపక్రపరాక్రమ క్రమము గలవాఁడు.

చరిత్రప్రసిద్ధుఁడగు మహామండలేశ్వరబేతరాజు మిగుల శూరుఁడు. కాకతీయులు మొట్టమొదట చాళుక్యరాజులయొద్ద సామంతులుగ, రాజప్రతినిధులుగ నుండి యవక్రవిక్రమముచే, బలుకుబడిచేఁ జతురంగబలములం గూర్చికొని చిన్నసామంతుల లోఁగొని, దేశవిప్లవముల విజృంభించి, పరిసరదేశముల నాక్రమించి స్వతంత్రరాజన్యులై యాంధ్రదేశమునంతయు మొక్కవోని పరాక్రమముతో దాదాపు మూఁడువందల సంవత్సరములు పరిపాలించిరి.

మహామండలేశ్వర ప్రోలరాజు వీరాధివీరుఁడునై పేరెన్నికఁగన్న మేటి. రుద్రదేవుఁడు ప్రజారంజకుఁడై హనుమకొండ రాజధానిగా రాజ్యమేలి లలితకళలను, మిక్కిలి పోషించెను. 'విద్యాభూషణ' బిరుదును వహించి, పండితపక్షపాతియై తానును, బండితుడు, గవియునై ప్రసిద్ధివడసియుండెను.

ఈతని యనంతర మీతని తమ్ముఁడగు 'మహాదేవరాజు'ను, గొలఁదికాల మప్రతిహతశౌర్యసారుండై రాజ్యమేలెను. ఈమహాదేవరాజునకు బయ్యమాంబికవలన జనించినవాఁడే గణపతి దేవ మహారాజు. ఈనరనాథుఁడు త్రైలింగ సామ్రాజ్యమును నలుదిశల విస్తరింపఁజేసి, చక్రవర్తి పదమును వహించి, "సప్తమ చక్రవర్తి" యని యాంధ్రావని నెల్లయెడల బ్రఖ్యాతివడసియుండెను. ఈ యాంధ్రసార్వభౌముఁడు కాకతీయ సింహాసనము నధిష్ఠించి, యాంధ్రము మాతృభాషగాఁగలవారి నందఱ నాంధ్ర సామ్రాజ్యముక్రిందకుఁ దేఁదలఁచి యెట్టి ప్రయత్నము లొనర్చె

నో యవియన్నియుఁ బరమేశ్వరానుగ్రహమునఁ గొనసాగెను. ఆంధ్రభూమినంతయు నేకచ్ఛత్రముక్రిందకుఁ దెచ్చినవెనుక నీతఁడు రాజ్యాంగమును, రాజధానీనగరమును, (ఏకశిలానగరము) దుర్గములను, సేనానివహములను, బలపఱచుటకు భగీరథ ప్రయత్నము లొనర్చి కృత కృత్యుఁడయ్యెను.

ఆకాలమున నీయాంధ్రసామ్రాజ్య రాజధానీ నగరము ఢిల్లీ చక్రవర్తులకును మోహముఁ గలిగించుచుండెడిది. దుర్గములోపలి రాజభవనములకుఁ జుట్టును, సున్నతమైన శిలాప్రాకారములు, దానిచుట్టును, నగాధమై, జలపూరితములగు, పరిఖలను నిర్మించుటయే కాక ప్రాకారమునకు లోపల రాజవీధుల నేర్పఱచి యచ్చటచ్చట నశ్వ రథ, గజ, పదాతి వర్గంబులఁ బెట్టించి, యహోరాత్రములు, వీరభటు లశ్వారూఢులై, రాజధానీ రక్షణ తత్పరులై సంచరించుచుండునటులొనర్చెను. సమున్నతములై సుందరములగు, రాజప్రాసాదములను గోపురములను గట్టించి వానిపైఁ బసిండికుండల నలంకరింపఁ జేసి యేకశిలానగరమున కెంతయో శోభను గూర్చెను. మఱియు ననేక శివాలయంబుల నిర్మాణముఁ జేయించెను. ఈ యాంధ్ర సార్వభౌముని కాలమున విదేశములతో వర్తక వ్యాపారములు, సముద్రయానమును, విశేషముగా సాగుచుండెను. ఈ రాజవరేణ్యుని మంత్రులలో ముఖ్యుఁడును, నీతి చాణక్యుఁడగు శివదేవయ్యా రాజ్యతంత్ర మర్మజ్ఞుఁ డగుటవలన గణపతిదేవ చక్రవర్తి పాలనమునకు వన్నెయు వాసియుం గలిగి పసిండికిం బరీమళ మబ్బినట్లుండెను.

# 2

ప్రాచీన మహర్షులు, మఱియుఁ గవికులవతంసుల యమరవాణి శ్రీరామహరిశ్చంద్రాది పురుషోత్తముల చైతన్య విలసిత గాథలయందు, సతీమ తల్లులగు సీతా సావిత్రీ దమయంత్యాది

నారీమణుల పుణ్యగాథలకును సముచితస్థానము నొసంగి వేయి నోళ్ళఁ గొనియాడియున్నారు. వైదికయుగమున గార్గిమైత్రేయి మున్నగువారు సుప్రసిద్ధులు, భర్తలకుఁ గార్యమునకు ఖడ్గము నకుఁ దోడుపడుచు వన్నెయు వాసియుం గాంచిన కైకేయి, సుభద్ర, ద్రౌపది, ప్రమీల మున్నగు వీరనారులు పురాణయుగ మునకుం జెందినవారు. మధ్యయుగమునాటి హిందూ సుందరీ మణులగు నహల్యాబాయి రాణీసంయుక్త ఝాన్సీలక్ష్మిబాయి మున్నగువారి చరితయు సువర్ణాక్షరములతో వ్రాయఁదగియున్నది. ఆంధ్రసామ్రాజ్యమును, సర్వజన మనోరంజకముగా మూఁడు పుష్కరములకాలము, తన యమలిన యశోవల్లుల దిగంతము లకుఁ జలువ పందిరులు వేసి వీరనారియై విలసిల్లినది మహా రాణి రుద్రమదేవి.

గణపతిదేవ చక్రవర్తికి నన్నివిధములైన భోగభాగ్యము లున్నను, బుత్రముఖావలోకనభాగ్యము లేదయ్యె. రుద్రాంబిక, గణపాంబికయను నిరువురు పుత్రికలు మాత్రము కలరు. ఈ రాజన్య చూడమణీ యిరువురు పుత్రికలఁ బుత్రులుగానే యెంచుకొని కడుఁగడు ప్రేమతోఁ జూచుచుండువాఁడు, జ్యేష్ఠ తనయయగు రుద్రమను, ధనుర్విద్యయందు, నశ్వారోహణము నందును మిగులఁ జాతుర్యముగలదానినిగాఁ జేసి యాయమను దన సరసఁ గూర్చుండఁ బెట్టికొని పరిపాలనా వ్యవహారముల స్వయముగా నెఱఁగించుచుండెను.

గణపతిదేవ చక్రవర్తి తన సామ్రాజ్యమును సువ్యవస్థిత మొనర్చి యాంధ్రులు జన్మవిరులనియు, నాంధ్రావని వీరభూమి యనియు, వెల్లడిచేసి యుండెను. నేల నాల్గుచెరఁగులనుండు రాజన్యులాతని భద్రసింహాసనమునకు నవరత్నఖచిత మకుట ములు వ్రాల్చి జేజేలు పెట్టుచుండిరి. ఆంధ్రుల వీరగాథలితర దేశీయులు కట్టుకథలవలెఁ జెప్పుకొనుచుండిరి. ఆంధ్రుల భోగ

భాగ్యముల కంభోధులు రాజమార్గము లయ్యెను. దేశమునఁ బ్రజలు శాంతిసౌభాగ్యములతోఁ దులఁదూగుచుండిరి.

చాళుక్యవంశీయుడగు వీరభద్రేశ్వరుఁడు రుద్రమ దేవిని వివాహమాడెను. ఈతఁడు ధాత్రీభారధురంధరుఁడై మహామండ లేశ్వరుఁడుగా నున్నట్లు శాసనాద్యాధారములవలనఁ దెలియు చున్నది. రుద్రమదేవికి 'ముమ్మడమ్మ' 'రుయ్యమ్మ' లను నిరు వురు సుత లుదయించిరి. రుద్రమదేవి భర్తయగు చాళుక్యవీర భద్రేశ్వరుఁడు యౌవనదశయందే మరణించియుండును. అం దుచే నాతనికి నాంధ్రుల చరిత్రమున నెక్కువ ప్రాధాన్యత కానరాదు.

గణపతిదేవుఁడు 'గణపాంబిక'ను ధరణికోట నేలిన రెం డవ కోట 'కేతరాజు' మనుమఁడగు 'బేతరాజున' కిచ్చి యుద్వా హమొనర్చెను. రుద్రమదేవి యెల్లప్పుడు పురుషవేషమునందుండి 'రుద్రదేవమహారా'జని పిలువఁబడుచుండెడిది గణపతదేవుఁడు దనపరిపాలనాచరమభాగమున నామెనుదనతో సభాభవనము నకుఁ గొనిపోయి తన సింహాసనమునం గూర్చుండఁ బెట్టికొని ప్ర త్యక్షముగా రాజ్యాంగవ్యవహారములఁ దీర్చి దిద్ద నేర్పియుం డెను. గణపతిదేవచక్రవర్తి తానిదివరలో నిశ్చయించుకొనిన ప్రకారమే తన చరమదశయందు రుద్రాంబికను దనయనంత రమునఁ బట్టముఁగట్టునట్లు స్వామిభక్తి తత్పరులును నాంధ్ర వీరవాహినీజయపతాకల నాయారాజ్యములఁ బాదుకొల్పుటలోఁ బ్రముఖపాత్రలను నిర్వహించిన మంత్రిసత్తములగు శివదేవ రుద్రప్రగడలను, సేనానాయకులగు త్రిపురారిదేవ, నాగదేవ మహాదేవరాజాదులను, మారమరాజు, ప్రోలరాజు మున్నగు నాయకులను నియోగించి దివంగతుఁడయ్యెను.

రాజభక్తి పరాయణులగు నమాత్యులు సేనాధ్యక్షులు, మహానాయకులు గణపతిదేవచక్రవర్తి యాజ్ఞానుసారము రుద్ర మదేవిని క్రి. శ. 1261 వ సంవత్సరమునఁ గాకతీయ భద్ర

సింహాసనము నధిష్ఠింపఁజేసి యాంధ్రసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తం జేసిరి.

గణపతిదేవచక్రవర్తి కైవల్యమునందిన నాటినుండియు దేశమున నల్లరులు చెలరేగ నారంభించెను. పరాక్రమధనులగు పలువురు పురుషులుండ నొక్కయబల ఖండఖండములలో నఖండఖ్యాతిని గడించిన కాకతీయ సామ్రాజ్యమును బరిపాలించుటయు, నామెకు వారు సామంతులైయుండి వినయవినమితోత్తమాంగులగుటయు, మండలపతులకు లజ్జాకరముగా నుండెను. ఎటులేని కాకతీయసామ్రాజ్యమును గబళించివైచి తమతమ రాజ్యముల విస్తరింపఁజేయవలయునను తలంపునఁ గొందఱును, బరాక్రమముతో విజృంభించి, కాకతీయదాస్యమును బాపుకొనునభిలాషతో మఱికొందఱును, నింతవఱకు దాచియుంచిన పతాకముల మెల్లమెల్లగా విప్పఁదొడంగిరి. ఈయల్లకల్లోలములతో నదరుబెదరులతో రుద్రమదేవి సింహాసన మెక్కుడఁ గూలిపోవునో యనున ట్లుండెను. రాజ్యాంగ వ్యవహారముల నుగ్గుపాలతోఁ ద్రావిన తెలుంగుపడుచు రుద్రాంబ రాజ్యమునకు మూలస్తంభమనఁదగు నగరమును, దుర్గమును బహుపటిష్ఠ మొనర్చెను. ఏకశిలానగరమునకుఁ జుట్టును గంపకోటఁ గట్టించెను. దీనికిఁ లోపలివైపున మట్టికోటను నిర్మాణముచేయించెను దీనికిఁ జుట్టును నగాధమగు నగడ్తలఁ ద్రవ్వించి నిరంతర జలపూరితములుగా నొనర్చెను. భూదుర్గమును బాగుచేయించెను. సోపానములను నిర్మాణముఁ జేయించి తన బంధువర్గములోని మత్తశుండాలములబోని వీరగణముల జాగరూకులై యహర్దివము కాపాడుచుండు నట్లేర్పఱచెను.

# 3

శత్రుజనదుర్భేద్యముగా నీరీతి దుర్గసంరక్షణమును జేసికొనుచుండ దక్షిణాపథము నేలుచున్న పలువురు రాజన్యులు,

విజయగండగోపాలుఁడు, రాజేంద్రచోళుఁడు, మనుమలిదేవ మహారాజు, సిద్ధయదేవచోడమహారాజు, మహారాజసింహ కొప్పె రుంజింగదేవ రెండవకటవరాయలు, అల్లాడ పెమ్మయదేవమహారాజు, పరిచ్ఛేది పాండ్రాజు, వల్లభరాజు, పెదకొమ్మరాజు, మున్నగువారు రుద్రమదేవి యబలయని తలంచి కత్తి దూసి యుద్ధమునకుఁ గాలుద్రవ్వుచుండిరి. ఇంద అన్నితీరుల సమర సముత్సాహులై తన సామ్రాజ్యమును గబళింప నుంకించుచున్నను జెదరక, బెదరక యుక్కుగుండెగలదియై వీరపుత్రియు వీరనారియు నగుట రుద్రమాంబ యందఱి రణరంగమున నెదుర్కొని రాజ్య రక్షణము సేసికొనఁ బ్రయత్నించుచుండెను. ఆవీరవనిత మంత్రి పుంగవులను, వీరసైన్యాధ్యక్షులను, భటజనులను బిలువనంపి, వారికి నేర్పు మెఱయఁ బలికి, వారి హృదయముల లోఁగొని వారి సహాయసంపదచే శత్రువాహినీ ప్రవాహము నరికట్టఁ దలఁచెను.

కాకతి 'గణపతిదేవు' ని కాలమునుండియు, విశ్వాస పాత్రులగు నాగయదేవమహారాజు, కాయస్థకులార్ణవచంద్రులై మొక్కవోని యుక్కుతునకలైన జన్నిగదేవసాహిణి, త్రిపురాంతక దేవమహారాజు, అంబయదేవమహారాజు, గోనగన్నయసాహిణి రుద్రమాంబకు దక్షిణభుజములై కాకతీయాంధ్ర సామ్రాజ్య రక్షణదక్షులై నాఁడా రాజ్యమును గబళింప నుంకించుచున్న రాజుల నాహవరంగమున విసర్జించి, రాజ్యమును సువ్యవస్థితముఁ గావించి సఫలమనోరథులైరి. కాయస్థకులతిలకులగు నీ సేనానులలో నంబయదేవమహారాజు మేటియని చెప్పవచ్చును. అతండు గండికోటమనోరథపట్టణము రాజధానిగా గండికోట, ములికినాఁడు రేనాఁటిసీమలను, బినాకినీ దక్షిణతీరమునంగల శకలి, ఎరువపొత్తపినాఁడు మున్నగుమండలములను బరిపాలించుచు 'మహామండలేశ్వర గండ పెండేర' యను బిరుదమును వహించియుండెను. మఱియు దోర్దర్పమున నెల్ల శత్రురాజుల

జయించియుండెను. దేవబ్రాహ్మణులకు గర్భశత్రువులైన మల్లికార్జునుని కదంబరాజైన దామోదరుని జయించెను. రాజ్యభ్రష్టుఁడైన మనుగండగోపాలుని విక్రమ సింహపురమున సింహాసనమెక్కించెను. అంబయదేవుఁడు తన పరిపాలనమున వ్యవసాయమున కనుకూలముగా భూములను గొలతవేయించి కాలువలు, చెఱువులు ద్రవ్వించి దేశము సుభిక్షముగా నుండున ట్లొనర్చెను.

గణపతిదేవచక్రవర్తి కాలమునుండియుఁ, గప్పము గట్టుచుసామంతుఁడుగానున్న కటకవల్లభుఁడు గణపతిదేవుఁడు పరమపదమందగనే కప్పముగట్టుటమాని స్వతంత్రుఁడయ్యెను. మఱలఁ గటకప్రభువును జయించి యాతనినుండి కప్పముఁ గొనుటకై ధీరయు, సువిచారయు నగు 'రుద్రాంబ' పోతయ నారయలను వారలకుఁ గొంతసైన్యముఁ దోడిచ్చి పంపెను. ఆమేటి యాంధ్రవీరులు నిర్వక్రపరాక్రమ పటుబాహుశక్తి దీపింపఁ గటకవల్లభు నోడించి, యాతనిఁ గాకతీయసామ్రాజ్యమునకుఁ గప్పముగట్టుచు,సామంతమండలేశ్వరుఁడుగా నుండునట్లుచేసిరి.

ఈవిధముగా రుద్రమదేవి యకుంఠిత పరాక్రమముతో నొప్పు సేనాపతుల సాయముతోడను, మంత్రాలోచనలలో శుక్రబృహస్పతులకు దీటగు మంత్రుల మంత్రాంగమహిమ తోడను దిరుగఁబడినవారందఱ నోడించి, మఱల నాంధ్రసామ్రాజ్యము నేకచ్ఛత్రచ్ఛాయక్రిందకుఁ దెచ్చెను. 'స్త్రీ' యని లఘుభావమూనిన మండలేశ్వరులకు రుద్రమదేవి యనవద్య ప్రతిభాపరాక్రమాదులు సింహస్వప్నమయ్యెను.

## 4

అట్టితరి రుద్రాంబ కటకవల్లభుఁడుజయింపఁబడి తక్కుంగల సామంతమండలేశ్వరు లందఱు నాజ్ఞానువర్తులైరిగదా యని యాంతరంగిక విషయములం జక్కఁబఱచుకొను చుండెను. రుద్రమదేవికి ముమ్మడమ్మ, రుయ్యమ్మలను నిరువురు కూతు

లుండిరి. ముమ్మడమ్మ చళుక్యాన్వయతిలకుఁడగు 'వీరభద్ర రాజు' ను వివాహమాడెను. ఈ'వీరభద్రరాజు' చరిత్రము సమగ్రముగఁ దెలియకపోయినను నాతఁడును నొకమండలేశ్వరుఁడై రుద్రదేవికి సామంతుఁడుగానుండిన ట్లూహింపవచ్చును. రుయ్యమాంబ దక్షిణకళింగాధీశుఁడగు నిందులూరి యన్నమ భూపాలు నుద్వాహమాడెను. అన్నమదేవభూపాలుఁడు, తనసహోదరుం డగు కొలనిరుద్రమనాయని సహాయమున రాజమహేంద్రవరము మొదలు సింహాచలము పర్యంతముగల భూభాగము నేలుచు రుద్రమదేవికి దక్షిణభుజమై కాకతీయసామ్రాజ్యమునకు జవమును, జీవమును గూర్చెను.

రుద్రమదేవి యిరువురు సుతలకు నేరికినిఁ జాలకాలము వఱకును సంతానముగలుగదయ్యె. ఇద్దఱిలో నేరికైనఁ బుత్ర సంతానము గలిగినచో వానిని గాకతీయసామ్రాజ్య సింహాసనము నధిష్ఠింపఁజేయవలయునని యాచక్రవర్తిని యూహయై యుండెను. ఈశ్వరాంశసంభూతుఁడగు కుమారుఁ డుదయించుటకై ముమ్మడమ్మచే నెన్నియో పుణ్యవ్రతములు షోడశమహాదానములు సేయించి, తమ కులదేవతయగు కాకతిదేవికి నుత్సవంబులఁ జేయించి, వడ్డెపల్లిలోని బుద్ధగణపతి నారాధింపఁజేసి, యేకవీరాదేవి నారాధించుటకు మొగలిచెర్లకు నేగి, యైదు, దివసము లచటనుండెను అట్టితఱి రుద్రమదేవి సవతితల్లి పుత్రులైన 'హరిహరదేవుఁడు,' 'మురారిదేవుఁ'డు ననువారు కొంతపరివారమును గూర్చుకొని యామెను బట్టుకొనఁ బ్రయత్నించిరి. కాని "రుద్రమచక్రవర్తిని," నిరుపమాన ప్రజానురాగాదరములు బడసినదగుట విశ్వసనీయులు, భక్తితత్పరులు నగు నమాత్య, భటవర్గముల సాయమునఁ దప్పించుకొనివచ్చి, యేకశిలానగరమును బ్రవేశించి, వారలఁ బుత్రమిత్రసమేతముగాఁ దునిమించి, వారి యైశ్వర్య మంతయుం జూఱఁగొని యాధనముతోఁ బద్మాక్షీ దేవికి ననేకమహోత్సవములఁ గావించి శత్రుశేషమును హతమార్చి కృతకృత్యయయ్యెను.

వీరనారీమణియగు రుద్రాంబ దుర్వారపరాక్రమధాటికి "దాసోహ" మ్మని కప్పములఁ గట్టుచు నణఁగిమణఁగియుం డిన సామంతమండలేశ్వరులు, త్రిపురాంతకుఁడు, అంబయ దేవుఁడు మారయనాయకాదులవంటి యవార్యశౌర్యధైర్యోపేతు లున్నంతవఱకుఁ దాము దలయెత్తి మసలుట పొసఁగనేరదని తలంచి, తమ కుట్రలు సఫలము కాలేదను నాక్రోశమున రు ద్రాంబిక నేవిధముగనేని రాజ్యచ్యుతం జేయందలంచి దేవగిరి రాజధానిగా రాజ్యమేలు మహాదేవరాజుతోఁ గుటిలతంత్రములం బన్ని, యుద్ధమున కాతనిం బురికొల్పిరి.

గణపతిదేవుఁడుమరణించిన వత్సరముననే దేవగిరినేలు యాదవప్రభుఁడగు కృష్ణభూపతి మరణించెను. ఆతని తరువాత నాతని సోదరుఁడగు మహాదేవరాజు పట్టాభిషిక్తుఁడయ్యెను. ఈ మహాదేవరాజు స్త్రీలను శిశువులను నెప్పుడు జంపినవాఁడు కాఁడు గావున నితఁడు పట్టాభిషిక్తుడైన వెంటనే "యీతని పరా క్రమమునకు భయంపడి యాంధ్రు లొక్క యాఁడుదానిని మా ళవులొక్క శిశువును సింహాసనము నెక్కించిరని శాసనములలోఁ గవు లీతనిఁ గొనియాడియుండిరి. ఆస్తోత్రపాఠములకుబ్బియు స్వామిద్రోహులగు కాకతీయమండలేశ్వరుల కుట్రలు, మాయో పాయములచేఁ బురికొల్పఁబడియు దేవగిరి యాదవప్రభువు మూఁడులక్షలసేనతో నోరుగంటిపై దండెత్తివచ్చెను. కయ్యమునఁ గాకలు తీరిన యాదవవీర సేనాని వహముతో యుద్ధసన్నద్ధుఁడై మహాదేవరా జోరిగంటి దుర్గమును ముట్టడించెను.

చారులవలన నీసంగతిని ముందే యెఱింగియున్న కాకతి చక్రవర్తిని దుర్గము నరిదుర్గమమును, దుర్భేద్యముగా, నొన ర్చెను. రాజ్యాంగ మంత్రాంగ వ్యవహారములలో మహామేధావు లైన శివదేవయ్య, రుద్రప్రగడ లమాత్యులై యండనిలువ నకుం ఠిత పరాక్రమములగు కమ్మవీరులు పద్మనాయకవీరులు కాకతీ యసామ్రాజ్యరక్షణకై యాత్మార్పణముసేయ సంసిద్ధులైయుండ జన్మవీరయగు రుద్రమదేవికి భయంపడం బని యేమి? మొక్క

వోని యుక్కుతునకలవంటి సుభటవర్గము, భుజాకండూతిని బాపుకొన నహమహమికతో ముందు దూక సంసిద్ధమైయుండెను. జన్మవీరులును బరాజయ మెఱుఁగని యోధశిఖామణుల దుర్గ ప్రాకారసంరక్షణకు నియోగించి, తాను స్వయముగ సర్వసేనాధ్యక్షపదవిని వహించి వీరపురుషోచిత వేషధారిణియై, తనుత్రాణంబు ధరయించి, కాసెబిగించి, యుత్తమజాతి రత్నంబగు ధవళాశ్వంబు నధిరోహించి శరశరాసనకృపాణఖేటంబుల ధరియించి, మృగేంద్రవాహనయు, మహిషాసురమర్దినియగు పరాశక్తియుఁ బోలె కరాళమూర్తియై రణదుందుభుల మ్రోయించి కదనరంగమున కురికి ప్రతిపక్షవీరుల నుక్కుమణఁచుచు, మత్తవారణసైంధవంబుల నురుమాడుచుఁ బిఱుదివియని వీఁకతో శత్రుమారణహోమంబు గావించుచుండెను. ఇట్లాహవంబున విజయంబు గోరి యుభయపక్షసైనికులును నసువులపై నాసవీడి మచ్చులేని మగటిమితోఁ బక్షము దివసములు పోరు ఘోరంబుగా నొనర్చిరి.

పాలకలని రుధిరమాంసవసాస్థి కపాలములచే భీకరంబై భీభత్సంబై భూతప్రేత పిశాచాదులకును భయావహంబై దుర్నిరీక్ష్యమై యుండెను. ఆంధ్రవీరుల పరాక్రమధాటి కాగలేక యాదవులు పలాయనమంత్రమును జిత్తగించిరి

సర్వసేనాధ్యక్షయైయున్న యాంధ్రవీర నారీమణి "యాంధ్ర సామ్రాజ్యమును జెంకుటయన్న క్షమింపరాని యపరాధ" మని యాదవులకు గుణపాఠమును బోధింప వెనుదగిలి దేవగిరివఱకుఁ దఱిమికొట్టెను. తుదకు నభిమానధనుఁడైనను యాదవవిభుఁడగు, మహాదేవరాజు పశ్చాత్తాపమునంది యకృత బుద్ధులునుఁ దురాలోచనాపరులును,దూరాలోచనావిరహితులునగు మాండలిక ప్రభువుల దుర్మంత్రంబులకుం జెవియొగ్గి నందులకు డెందంబునఁ గొందలంబునంది, కోటద్రవ్యంబు లపరాధంబుగా నిచ్చి రుద్రమదేవిని శరణువేడి సంధిఁగావించుకొని, నిజరాజధానికి నేగెను.

రుద్రమదేవియు నసువులపై నాసవీడి, శౌర్యసాహస విక్రమ విహారములంగావించి, జయంబునార్జించిన యాంధ్రవీర సైనికులకు సముత్సాహ సూచకంబుగ నాధనరాసులం బంచి యిచ్చి యాంధ్ర, యాదవసామ్రాజ్యంబుల సరిహద్దుల నేర్పఱించి విజయసూచకంబుగా జయస్తంభములం బాతించి వానిపైఁ దన దివ్యాభిధానాక్షరంబులను, విజయశాసనములను వ్రాయించెను.

రుద్రమదేవి పరిపాలమున నీ విధముగఁ గలహములు, కల్లోలము లుండినను, జంకుగొంకులులేక యెన్ని యాపద లామెను దార్కొన్నను స్వస్థచిత్తముతో నాలోచించి ధైర్యసాహ సౌదార్యముల వాని నెదుర్కొని విజయలక్ష్మి నార్జించుటయే యామయ లక్ష్యమైయుండెను. ఆ వీరనారి రాజ్యతంత్ర చాతుర్యము, ప్రజానురాగము, కార్యకుశలత, పరిపాలనా సౌష్ఠవము పరరాజులకుఁ బ్రక్కలోబల్లెమై తేఱిచూడరాక యుండెను. ఈ విధముగ రాజకీయ విషమపరిస్థితుల నన్నిఁటి నెదురుకొని దేశమున శాంతి సౌఖ్యములు సుస్థాపితమ్మొనర్చి రుద్రమదేవి చక్రవర్తిని సముద్రవ్యాపారము, మతవ్యాప్తియందును దనకాలమును వినియోగించుచుండెను. నిగూఢ వేషంబులఁ బ్రజల కష్టసుఖముల నెఱుంగుటకై రాత్రిందివమును పట్టణము, పల్లెలు, గ్రామములు సంచరించుచు వారి యిక్కట్టులం దొలఁగింప యత్నించుచుండెడిది.

రుద్రమదేవి కల్యాణతపఃఫలమున, పరమేశ్వర వరప్రసాదమున ముమ్మడాంబా గర్భశుక్తి ముక్తాయమానుఁడై రోహిణీ నక్షత్రము, బ్రాహ్మీముహూర్తమున, సూర్యాంగారక బృహస్పతులుచ్చస్థానగతులైయుండ శనైశ్చరుండు స్వస్థానంబున నుండ ప్రతాపరుద్రుఁడు భావిప్రతాపరుద్రుఁడై జననంబందెను.

నాఁ డేకశిలానగరంబునఁ బ్రతియింటను మహోత్సవంబులు గావింపఁబడెను. రాష్ట్రమున నూరూరను, వాడవాడల యందును, దేవాయతనములందును బచ్చతోరణములు పందిళ్ళ

తో వేడుకలు వినోదములు విలసిల్లెను. ఇంద్రభోగములతోఁ గులదేవతలకు, గ్రామదేవతలకు మహోత్సవములు గావింపఁబడెను.

వేయేల! పంగ్వంధ బిక్షుక బ్రాహ్మణ పరివ్రాజకాతిథులు భూరిభోజనదక్షిణలతోఁ దృప్తులైరి. ఎచ్చటఁ గాంచినను రాష్ట్రమున 'నిత్యకల్యాణము పచ్చతోరణము' శాంతి సౌభాగ్యములే.

ప్రతాపరుద్రుఁడు శుక్లపక్షసుధాంశుని చాడ్పున దినదిన ప్రవర్ధమానుఁడై పెద్దవాఁడగుచుండెను. ముమ్మడమ్మ రెండవ పుత్రునిపే రన్నమదేవుఁడు. రుయ్యామ్మకు సంతానము లేదు. ప్రతాపరుద్రుఁడు దేశికులకడ గీర్వాణాంధ్రములు, ధనుర్విద్య, ఖడ్గచాలనము, గజాశ్వారోహణము, రాజ్యాంగ వ్యవహారములు శరీరవ్యాయామము, మున్నగు రాజవీరకుమారోచిత విద్యలఁ బ్రవీణుఁడయ్యెను. రుద్రమదేవి కువలయా నందకరుండగు ప్రతాపరుద్రరాజును దనవెంట నుంచుకొని రాజ్యతంత్ర మర్మముల నెఱింగించి యాతనిని వీరునిగా, ధీరునిగా, సముత్సాహినిగా నొనర్చెను, రుద్రమదేవి చక్రవర్తిని యొనర్చిన సత్కార్యములు, దేశహితకృత్యము లసంఖ్యాకములు.

ప్రోల ననేక శివాలయంబుల తీవిఁ
గట్టించి బయలి యంగణములందు,
నానామహీరుహోద్యానముల్ వేయించి,
యైదువేల వసుంధరామరులకుఁ
బెండ్లిండ్లుసేయించెఁ, బృథివి నాలుగుకోట్ల
ద్రవ్యంబు పాతించి, తవిలి పెక్కు
చెఱువులు ద్రవ్వించి చెప్ప నబ్రంబుగ
నన్నసత్రంబు లెన్నైనఁ బెట్టి
నఖిలజనులును దనునంబయనుచు సారె
వలుకుటయుఁ దనపేర 'నంబాల' యనెడు
నూరుఁగట్టి నిజమైన వేరవేయి
రుద్రపరములు గట్టించె రుద్రమాంబ.

# 5

ఆంధ్రదేశములోఁ గాకతీయరాజన్యులనాటికి శైవమతము మూఁడుపూవు లాఱుకాయలుగా విలసిల్లినది. క్రమక్రమముగా జైనమత మంతరించుచుండెను. శైవగురువులు, శైవాచార్యులు దేశమున నన్నిప్రాంతములఁ బ్రబలి తమ బోధలచే మహారాజులను లోఁగొని వారికి దీక్షలొసంగి వారని శైవమతావలంబకులుగా నొనర్చుచుండిరి. పరమశైవులుగా నేర్పడిన కాకతిరాజవరేణ్యులు, వారి సామంతులు శివపురములనుఁ బేరుతో ననేక గ్రామములను దానముచేసినారు. శివాలయములకు వారొనర్చిన దానములకు లెక్కలేదు. శివమఠములు బహుళముగా వెలసినవి. ఇవి యన్నియు విద్యాపీఠములే శ్రీశైలముపై నైదు శివమఠము లుండెను. ఒక్కొక్క మఠమునకిందను గొన్నియూళ్ళును, వేలకొలఁది శిష్యులు నుండువారు. ఆకాలములోఁ బ్రసిద్ధమైన మఠము గోళకి యనునది. దీనికిఁ ద్రిపురాంతకము, పుష్పగిరి మున్నగు స్థలములందు శాఖ లుండెడివి. ఈ గోళకీమఠమునకు విశ్వేశ్వర శివాచార్యులు నిర్వాహకుఁడును, పెద్దయై యుండెను. ఈ మఠమున నుండు వారంతయు నుత్తరమున, గౌడదేశము నుండి వచ్చినవారు. వీరిలో బ్రాహ్మణులు, కాయస్థులునుగలరు. కాయస్థులాగౌడ దేశమున లెక్కలు, పద్దులు మున్నగు వానిని వ్రాయుటలో నారితేఱినవారు. వీరు కాకతి రాజచంద్రుల సహాయసంపదలతో రాజ్యమునుగూడ సంపాదించినారు. రుద్రమదేవి చక్రవర్తిని తాను రాజ్యమునకు వచ్చిన రెండవ సంవత్సరమునఁ కృష్ణాతీరముననున్న 'మందడ' మను గ్రామము సగ్రహారముగా నిచ్చినది. మఱియు దానశీలయగు నీమహారాణి వెలగపూడియను గ్రామమును ధారాదత్తముగా నిచ్చెను. మహనీయుఁడును, స్వార్థవిరహితుఁడునగు శివాచార్యులు చక్రవర్తులు, రాజులనుండి బహుగ్రామముల నగ్రహారములుగాఁ బడసి వాని యాదాయమును దేశోపయోగమునకుగా నుపయోగించెను.

గోళకియను పేరంబరగు నీ విద్యాపీఠమున మఠనిర్వహణమునకు, నుపాధ్యాయ పోషణమునకు, విద్యార్థుల పోషణమునకుఁ, బ్రసూతివైద్యాలయమునకుఁ దగిన భూవసతుల నీ శివాచార్యుఁ డేర్పఱచెను. ఆ విద్యాపీఠమున వేదములు శాస్త్రములు, సంగీతము మున్నగు కళలు, వృత్తివిద్యలు నేర్పుటకుఁ దగిన యుపాధ్యాయుల నేర్పఱచి వారి యర్హతకుఁ దగిన భూవసతులఁ గల్పించెను. ఈ మఠమున సూర్యోదయము మొద లన్నిజాతుల వారికిని నెడతెగకుండ నన్నదానము చేయఁబడుచుండెడిది. మఱియు నన్నివృత్తులవారికిని దగిన వసతులఁ గల్పించి, దేశ సౌభాగ్యశాంతి సంపదలకుఁ దోడ్పడెను. మఱియు నీ యాచార్యసత్తముఁ డేవిధముగను మార్పు వీలుపడని నీతినియమములు, కట్టుదిట్టములను గావించెను.

రుద్రమదేవి పరిపాలనమున వైద్యము తర్కసారస్వతాగమములు చిత్రకళలు, వృత్తివిద్యలు, జనాదరమును బడసినట్లు దెలియుచున్నది. నేఁటి కారేడువందల యేండ్లనాడే యాంధ్ర దేశమునఁ బ్రసూతి వైద్యశాలలు. మాతృశిశుపోషణమున కనువైన వైద్యవిద్య మున్నగునవి గలవనుటచే నాటి రుద్రమదేవి పరిపాలన మెంత యుత్కృష్టమైనదో వెల్లడి కాఁగలదు.

రుద్రమదేవి తనయపూర్వశేముషీశక్తి సామర్థ్యాదులవలన గణపతిదేవుఁడు స్థిరీకరించిన సామ్రాజ్యంపు పునాదులను గట్టిపఱచి యాంధ్రరాజ్య విస్తృతిని గావించి, యమాత్యులు, సేనానాయకుల తోడ్పాటుతోఁ జాలకాలము ప్రజారంజకముగాఁ బరిపాలన మొనరించిన ధీర, వీర, సువిచార.

తగిన శిక్షనిచ్చినచో నారీమణు లుయ్యాలలనూపు మృదుహస్తములతో కఱకుకరవాలముల ధరించి, నిష్కంటకముగ నూళుల సైత మేలఁగలరని రుద్రమదేవి చరిత్రము వెల్లడి చేయుచున్నది. విదేశీయులు, విజాతీయులు నక్కజం పడునట్లుగా (మార్కోపోలో వేనీసువర్తకుఁడు మున్నగువారు)

ప్రజలు తనను గన్నతల్లియని యెంచఁగాఁ గాగతీయమహా సామ్రాజ్యమును గాపాడి యాచంద్రార్కస్థాయియగు విశద నిష్కళంక యశము నార్జించి ధన్యయైనదీ యాంధ్రవీర మహిళామతల్లి. పలనాటి వీరనారియగు నాయకురాలిలో నసంపూర్ణముగనుండిన యాంధ్రనారీసామర్థ్యము, ప్రాభవప్రతిభావిశేషాదులును మచ్చలేనివై రుద్రదేవియందుఁ గేంద్రీభవించినవని యీ మహనీయురాలి చరిత్రపఠనమున వెల్లడియగును.

క్రీ. శ. 1295 సం. న. రుద్రమదేవి తనవార్థకమునఁ దన దౌహిత్రుఁడు దత్తపుత్త్రుఁడు నగు శ్రీమహావీర ప్రతాపరుద్రుఁడు యుక్తవయస్కుఁడుకాగా నాతనిఁ గాకతీయాంధ్ర సామ్రాజ్య వజ్రసింహాసనమునకుఁ బట్టముగట్టి, యాతండు శిష్టరక్షణము, దుష్టశిక్షణము పండితకవి, గాయకపోషణముఁ గావించి యాదర్శప్రభువగునట్లుగాఁ దీర్చిదిద్దెను.

కాకతిసార్వభౌములే కాక వారి యమాత్యులు, సేనా నాయకులు, మండలేశ్వరులు, దుర్గపురపాలకులు కృతి భర్తలు, కృతి కర్తలునై గీర్వాణాంధ్ర భాషాయోషల నమూల్యాలంకార రీతివృత్తుల నలరించిరి.

ఆకాల మాంధ్రవీరజాతి విశదవిస్మృమర యశోవల్లి కావ్యాప్రతికి సర్వతోముఖ వికాసమునకు నలువలంకులు చలువవెల్లువలు వెదజల్లు ద్రాక్షాకాయమానములైనవి. నవలక్షధనుర్ధారుల శింజినీటంకారములు చతుర్దిశావకాశముల మాఱుమ్రోగఁ బ్రతాపరుద్రచక్రవర్తి యవక్రవిక్రమముతో శాంతిసౌఖ్య సౌభాగ్యములఁ బ్రజలలరఁ బరిపాలించెను.

ఆంధ్రుల గతచరిత్రము మహోజ్జ్వలము. ఆంధ్రజాతి భవిష్యచ్చరితము, సర్వతోముఖముగా మహోజ్జ్వల మగునట్లు తీర్చిదిద్దు బాధ్యత నేటి యాంధ్రవీరులపై నున్నది.

---

# అనపోతనాయకుఁడు

## 1

నిర్వక్రపరాక్రమముతో ఢిల్లీశ్వరులకును, గన్నులు గుట్టు నట్లు, కాకతీయాంధ్రసామ్రాజ్యమును బరిపాలించిన శ్రీమహా వీర ప్రతాపరుద్రచక్రవర్తికి సేనానాయకుఁడు రేచర్ల సింగమ నాయఁడు. ఈతఁడు 'మగతల' యను గ్రామసమీపమునఁ గాక తీయ సామ్రాజ్యమును వ్యతిరేకించిన మచ్చకొమ్మ నాయకుఁ డను శూరుని వధించెను. మఱియు రుద్రనాయఁడను వీరుని దునుమాడి ప్రతాపరుద్రుని గౌరవమర్యాదలకుఁ బాత్రుఁడ య్యెను. ఇంకయు నవలక్ష తెనుగుదళంబుల యుద్ధమున జయిం చి మించిన పాండ్యరాజుల ఘోరయుద్ధమున జయించి యనేక వస్తువాహనాదుల శిరోభూషణమగు నొక గొప్పపచ్చను, నొకస్వర్ణ మయ సింహాసనమును దెచ్చి ప్రతాపరుద్రచక్రవర్తి కర్పించి యాయనచేఁ 'బంచపాండ్య దళవిభాల' 'కంచికవాటచూరకార' మున్నగు బిరుదములను ననేక వరముల నీదాచయసింగభూపా లుఁడు ధరించియుండెను. సింగమనాయఁడు మిగుల దేవబ్రా హ్మణభక్తి గలవాఁడు. ఈతని పుత్రులే, అనపోతనాయఁడు, మాధానాయఁడు ననువారు.

ప్రతాపరుద్రుని మరణానంతర మాంధ్రసామ్రాజ్యము భగ్నమై యేసేనానాయకుని క్రిందనున్న భూభాగమున కాసై న్యాధపుఁడే ప్రభువునని ప్రకటించుకొని, పరిపాలనము సేయుట సంభవించెను. ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి చంచలయై తానువరింపఁ దగిన శౌర్యధైర్యసారుఁడగు భూనాథుఁడు లేకుండుటచే ముందు వెనుకల జూచుచుండెను. అట్టియెడ దక్షిణాపథమునఁ దురు ష్కుల దండయాత్రలు మెండయ్యెను. అప్పుడే నిజాము రాజ్య ములోని యాంధ్రప్రాంతము నాక్రమించి దేవరకొండ, రాచ

కొండ దుర్గముల నిర్మించుకొని యకుంఠిత బలపరాక్రమము లతోఁ దురుష్కులకుఁ బ్రక్కలోబల్లెమై ప్రజారంజకముగా రాజ్యమేలినవాఁడు సింగమనాయఁడు. శూరశిఖామణియుఁ, బద్మనాయక వంశజుఁడునగు నీయనపోతానాయఁడు తనతండ్రి వీర ప్రతాపరుద్ర చక్రవర్తికి సేనానాయకుఁడుగా నున్నయప్పుడే గండరగండలగు వీరుల జయించి 'మచ్చనాయకగండ' యను బిరుదము ను వహించియుండెను.

మహమ్మదీయులు తండోపతండములుగా దక్షిణాపథమునకు వచ్చి, రాజ్యపాలన మొనర్చుచు హైందవుల మతాచార్య వ్యవహారములకు హానిని గలిగించుచుండఁ బ్రతాపరుద్రుని పుత్త్రుఁ డదికాంచి ద్రావిడకర్ణాట నాయకులతో నాలోచించి, వారిసాయమున నోరుగల్లును ముట్టడించి ఘోరంబుగాఁబోరి మహమ్మదీయుల నోడించి మఱల నచ్చటనే పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈవిజయమున సింగమనాయఁడు ప్రముఖ పాత్రను నిర్వహించి తనపరాక్రమజ్యోతుల నెల్లయెడల వ్యాపింపఁజేసి యుండెను. రాచకొండదుర్గమునుండి తపర్తు మధ్యందిన మార్తాండుని వడువున దుర్ని రీక్ష్యప్రతాప, పరాక్రమశాలియై యుండెను. యుద్ధపరాజితులగు రాజన్యులకు సింగమనాయఁడు కొఱకరానికొయ్య యయ్యెను. సామంతులగు జల్లపల్లి దుర్గపు రాచవారు పలుమాఱు లెదిరించ, యపజయావమానములఁ గ్రుంగియు నిరుత్సాహపడక యాతని బావమఱఁదియగు సింగమ నాయని నెట్లో బంధించి చెఱయందుంచిరి. అవార్త విని సింగమనాయఁడు వ్రేటువడ్డ కాలభుజంగము రీతి దుర్ని రీక్ష్యుఁడయ్యు శాంతిప్రియుండై యావీరుని విడచిపెట్టుఁడని రాచవారికడకు రాయబారమంపెను. కుటిలులయెడ నార్జవము ఫలింపదుగదా! అదియెఱింగి బలదర్పితులయెడ దండోపాయమే శరణ్యమగుట నపారసేనాసమేతుఁడై జల్లపల్లిదుర్గమును ముట్టడించెను. రాచవారు గొన్నిదివసములు పోరియుఁ, దమ కపజయము తప్పదని యెఱింగి, కపటోపాయమున సింగమనాయనిఁ జంపనెంచి, కల్ల

కపటములకుఁ బుట్టినిల్లగు తమ్మళిదమ్మాజి యను నొకవీరుని రాయబారమంపిరి. ఆ తమ్మళివీరుఁడు తనరాకను భటులచే సింగమనాయని కెఱింగించి, యాతని యనుమతిని లోనం బ్రవేశించి, చింతపల్లి సింగమనాయని నిప్పుడే విడుతుమనియు, మఱియు నపరాధమునుగూడఁ జెల్లింతుమనియు, రాచవారిపక్షమున, క్షమింపు మనియు వేడుకొని, స్నేహము నెఱపి, విస్రంభాలాపము లాడఁజొచ్చెను. సాధుశీలుఁడును, గపటవర్తన మెఱుఁగని సింగమనాయఁ డూరకరక్తపాతమేల యని సేనానాయకులకు యుద్ధముఁ జాలింపుఁడని యాజ్ఞయిచ్చెను. ఆహా! మహాత్ములు దయాసారులు గదా!

పయోముఖవిషకుంభమగు తమ్మళివీరుఁడు గుప్తముగాఁ గటిసీమయందు దాచిన కఱకుబాకుతో సంగమనాయనిఁ బొడచి, యీ విషయము వెల్లడికాకమునుపే పాఱి జల్లపల్లిదుర్గమును జేరెను. భీషణహుతాశనకీలవోలె యీవార్త పద్మనాయకుని సేనానివహమున నెల్లయెడల వ్యాపించెను. జవనాశ్వముల నెక్కి కొందఱా విశ్వాసఘాతుకునిఁ బట్టుట కేగిరి. కాని వాడింతకుముందే గమ్యస్థానమును జేరియుంట వీరి ప్రయత్నము వ్యర్థమయ్యెను.

శూరశిఖామణులును, భీమార్జునులఁబోలిన యనపోతనాయఁడు, మాదయనాయకుఁడును నాయుద్ధమునఁ దండ్రివెంటనే వచ్చియుండిరి. భీషణాశనిపాతమునుబోలిన యావార్త విని తండ్రిసన్నిధికి నేతెంచిరి. అప్పుడు, "కుమారులారా? రాజధర్మము, యుద్ధనీతినివిడచి రాచవారు మాయోపాయమున నన్ను పాంశువధజేసిరి. అరుంతుదమగు నీమరణాయాసమును భరింపఁజాలను. రేచర్లగోత్రీయుల వీరరక్తము మీరక్తనాళములలోఁ బ్రవహించు చోనిహమున భీకరరణావనుల సరివీరులకు వెన్నుఁ జూపని నాకుఁ బుత్త్రులగుచోఁ గపటవర్తనమున నన్ను మడియింపఁజేసిన యరిరాజుల కవోష్ణరక్తముతోఁ బరలోకగతుఁడ నగు నాయాత్మశాంతికై తిలతర్పణ మాచరింపుఁడు. ఇదియే

నాచరమాభీష్టమని" వచించి, "నాముందట్లు సేయుదుమని ప్రతినలఁ బూనుఁడు తరువాత నాయుధము నూడఁదీయుఁ" డనియె. పితృవధామర్ష చిత్తులును బరశురామాశ్వత్థామలకుఁ దీసిపోని యాసోదరమత్తశుండాలములు. వీరాధివీరా? మీచర మాభీష్టమును దప్పక నెఱవేర్చి పితౄణవిముక్తుల మగుదుము. మీరు చింతమానుఁడు. పులికడుపున హరిణశాబకము లుదయిం చునా? యనిరి. బాకునూడఁదీయగా సింగమనాయఁడు పరలో కమునందెను.

# 2

పితృమరణసందర్శనము సహజశూరులగు నాసోదరుల నసహ్యక్రోధామర్షాగ్నిభీకరజ్వాలామాలలు గప్పివేసెను. పితృఘా తుకులఁ దుదముట్టించి, వారి కోష్ణరుధిరమునఁ బితృపాదులకుఁ దిలాంజలులనిచ్చువఱకు వారికి నిద్రపట్టదయ్యెను. అదియేయన పోతనాయని దిగ్విజయ యాత్రారూపకమునకునాంది యయ్యెను.

స్వామిభక్తులు, శూరాగ్రగణ్యులగు సేనానాయకులు, భటనికాయము పద్మనాయక శూరసోదరులకుఁ బితృవధామర్ష ప్రతిజ్ఞా నిర్వహణమున నండయైనిలచి చంపను, జావను సర్వ విధముల సంసిద్ధులమని యేకగ్రీవముగాఁ బ్రతినఁబూనిరి. పిత ర్ధమై తామొనర్చిన ప్రతిజ్ఞానిర్వహణమున బద్ధకంకణులై జనకు నకు దహనాదిసంస్కారములం గావించిరి. అనతికాలముననే రాచకొండ,దేవరకొండలోని బలములన్నియుఁ బిలిపింపఁబడెను. వెలమవీరుల వారణాశ్వరథ పదాతిసేనానివహముతో జల్లపల్లి ప్రాంతమంతయు నేలయీనినట్లుండెను. పగఁదీర్చికొను నుత్సా హముతో వెలమవీరుల సేనలు శౌర్యధైర్యములతోఁ గయ్యము నకుఁ గాలుద్రవ్వుచుండెను.

వెలమవీరుల శౌర్యసారము నెఱిఁగినవా రగుటను జల్లపల్లి రాచవారి గుండెలు 'దటతటఁ' గొట్టుకొనుచుండెను. సింగమ

నాయని పుత్రుల యాధిపత్యమున నుండనొల్లని స్వాతంత్ర్యేచ్ఛగల రాచవారు, అనల్పచతురంగ సేనాయుతులగు రెడ్డిరాజులు, రామగిరి, అనంతగిరి, కందికొండ, జమ్మిలోయ మున్నగు ననేక దుర్గములఁ, బాలించుమండలాధిపతులు కమ్మవారు సేనాయుతులై వెలమవీరుల డీకొనుటకు జల్లపల్లి వారిం జేరిరి. ఉభయ పక్షములును యుద్ధమునకు సర్వసంసిద్ధమయ్యెను. జల్లపల్లి దుర్గము ననపోతనాయఁ డుక్కుతున కలవంటి యోధులతో ముట్టడించెను. ఇరువాగులవారును బ్రాణములపై దీపిలేక యెదిరి సైన్యముల నుఱుమాడు చుండిరి. వెనుదీయక వీరులెందఱో యాహవరంగమున నేలకొఱఁగి వీరస్వర్గమును జూఱఁగొనుచుండిరి. యుద్ధరంగమున నెత్తురుటేరులు ప్రవహించెను. ప్రధన భూమిరక్తమాంసమేదస్సులతో భీభత్సమై, భీకరమైయుండెను. పద్మనాయక సోదరుల ప్రోత్సాహవచనములతో వెలమసేనానులరివీరకంఠలుంఠన కళాప్రావీణ్యముం జూపుచుండిరి. దైవోపహతులగు జల్లపల్లి రాచవారు సమూలచ్ఛేదముగా వధింపఁబడిరి. సాయపడిన మఱికొంద ఱితరరాజులు సంగ్రామరంగమునువీడి పలాయితులై చనిరి. జయలక్ష్మి యనపోతనానినే వరించెను. అవితథసంకల్పులు, సముత్తీర్ణ ప్రతిజ్ఞాసాగరులునగు నాసింగభూపాలసుతులు శితాసిధారానికృత్త కంఠనిస్సరత్కవోష్ణ రుధిరమునఁ బితృదేవునకు మంత్రపూతములగు జలాంజలుల నర్పించి కృతకృత్యులైరి.

మఱియొకమాఱుఁగూడ హతశేషులగు రాచవారు విజృంభింప ననపోతవీరుఁడు వారిని రూపడంచి, యాహవరంగమునకు బలిఁగావించి 'అష్ట దిగ్గజభయంకర,' 'సోమకుల పరశురామ' 'భుజబలభీమ' 'రణదేవేంద్ర' మున్నగు వీరబిరుదములం గాంచియుండెను జల్లపల్లి రణక్షేత్రమున ననపోతనా యని వీరవిహార విజయనాదములు, దశదిశావ కాశముల మాఱుమ్రోగు చుండెను.

పూర్వము పితృవధామర్షక్రోధుఁడై భార్గవరాముఁ డిరువది యొకమాఱు భూమండలమంతయుఁ దిరిగి నిఃక్షత్రియముగా నొనర్చియుండెను. ఈయనపోతనాయఁడును నూట యిర్వదొక్కరు శత్రురాజన్యుల సమయించెనని శాసనములు చెప్పుచున్నవి.

ఈక్ష్మానాధుఁడు హైద్రాబాదు రాజ్యములోని భువనగిరి, ఓరుగల్లు, రాచకొండ, రామగిరి, గోలకొండ, కంబముమెట్టు, దేవరకొండ మున్నగు దుర్గములకై వసమొనర్చుకొని శత్రుశేషములేకుండ జేసి, వయఃకాలమంతయు విజయయాత్రలు, పరరాజ్యాకర్షణలతోఁ గడపి దాదాపుగా నాంధ్రదేశము నేలుచు 'నాంధ్రదేశాధీశుండ'ను సార్థకాభిధానంబు నంది రాచకొండ రాజధానిగా నాంధ్రసామ్రాజ్యపట్టాభిషిక్తుండయ్యెను.

# 3

ఆకాలమున రాచకొండ (రాజగిరి) దుర్గము మిగుల బలిష్ఠమై యరిదుర్గమమై యుండెను. అనపోతక్ష్మానాథుని కాలమునుండియు నీదుర్గమే రేచర్లవంశీయులగు వసుంధరా వల్లభులకు రాజధానియై యుండెను. రాచకొండ హైదరాబాదు రాజధానికి 34 మైళ్ళ దూరమునఁ దూర్పుదిశగా నల్లగొండ మండలమునఁగలదు. నారాయణపురసంస్థానమునకుఁ బడమరగా నాఱు మైళ్ళ దూరమునఁ బెట్టనికోటవోలె చుట్టును వ్యాపించిన పర్వతశ్రేణులు గలవు. తృణకాష్ఠ జలసమృద్ధమగు నీప్రదేశమునఁ బదునైదుమైళ్ళు వలయము గలిగిన దుర్గ మరివీరదుర్గమమై చెక్కుచెదరకయుండెను. ఈదుర్గమునకుఁ జతుర్ముఖముల నాలుగు ద్వారములు గలవు. తూర్పు ద్వారము మట్టివాడ ద్వారమనియు, దక్షిణద్వారము గండికోట ద్వారమనియుఁ బడమటి ద్వార మేనుఁగుల గండి యనియు, నుత్తరద్వారము భువనగిరి గండి యనియు వ్యవహరింపఁబడుచుండెను. ఆద్వారముల సమీపమున నతివిస్తృత శిలలపై గండభేరుండ, వీరాంజనేయ, కాల

భైరవాది వీర విగ్రహములు జీవకళలుట్టిపడినట్లు చిత్రింపఁబడి వానిక్రిందఁ బద్మనాయక వంశ నరేంద్రుల విరబిరుదములు దిగ్విజయాంకములు చెక్కఁబడియున్నవి.

దుర్గమధ్యప్రదేశమున రాచకొండయనియు, నాగనాయని కొండ యనియు రెండుకొండలు గలవు. నేటికి నందు రాజప్రాసాదములు, దేవాలయములు, చెఱువులు, బావులు, ఘంటాపథములు, నంగడివీధులు, శిథిలావశిష్టములు శిల్పకళాప్రావీణ్యమును వెల్లడిచేయుచు ప్రాచీనవైభవమును గనఁబఱచుచున్నవి. శిథిలావశిష్టములందే శిల్ప సౌందర్యము చెన్నారుచుండ నిగ్గులు దీరిన తొల్లింటి వాని మంజులత మనయూహా ప్రపంచమునకు గోచరింపకమానదు. నాగమనాయఁడను వీరుఁ డాశ్రయించియుండుటచే నాగనాయనికొండ యని పేరువచ్చినది. అగ్రజుఁడగు ననపోత భూవల్లభునకు నండయై దేవరకొండ దుర్గమును బరిపాలించు మాదానాయని బలపరాక్రమాదులు విస్మయాపాదకములు, 'రాచకొండ' దుర్గమువలెనే 'దేవరకొండ' దుర్గమును మిగుల జలిష్ఠమైనది. రణరంగమున నోటమి యెఱుంగని తొమ్మండుగురు వెలమనాయకులు సైన్యాధ్యక్షులై యీదుర్గమునుండి, యరిభీకర ప్రతాపపరాక్రమసారులై రాజ్యరక్షణమున, సంగ్రామరంగమున ననపోత నరేంద్రునకుఁ దోడుపడుచుండిరి.

# 4

ఆకాలమున మహారాష్ట్రదేశములోని చాలభాగమును, ఆంధ్రదేశములోని కొలఁదిభాగమును దనయధీనమున నుంచుకొని 'బహమనీ' రాజ్యస్థాపకుఁడగు 'అల్లాయుద్దీన్‌షాహ' కలుబరిగ రాజధానిగా రాజ్యము సేయుచుండెను. విద్యానగరము, రాచకొండ రాజ్యములలోని కొన్ని దుర్గములను, తన రాజ్యము పరిహద్దులోని వాని, నధీనముఁగావించుకొనియెను. విజయనగరము నేలుచున్న బుక్కరాయలు, అనపోతవసుధాధిపుఁడును,

నామహమ్మదీయుఁడు గావించు దుర్ణయములను గాంచి యాయవనుని మట్టుపెట్టుటకు యత్నించుచుండిరి. ఇంతలో అలాయుద్దీన్‌షాహ గతించెను. అతని పుత్రుఁడగు 'మహమ్మద్‌షాహ' 'బహమనీ' తండ్రిరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. ఆసూతనుని రాజ్యములో నశాంతి, కల్లోలములు మెండుగానుండెను. అప్పు డనపోతమహీపాలుఁడు బుక్కరాయలును, నాతని తండ్రి దురాక్రమణవాంఛఁచే గైకొనిన రాజ్యభాగముల వదలివేయవలయుననియు, లేకున్న మాయపారసేనావాహిని నీరాజ్యమును ముంచివేయుననియు రాయబారులతో వర్తమానమంపిరి.

అప్పుడు మహమ్మదుషాహ రాజ్యపరిస్థితి యనుకూలముగాలేనందున మీయభీష్టము తీరుననే వర్తింతుమని నటించి తన రాయబారుల నాంధ్రరాజన్యుల కడ కనిపి వచ్చిన యా రాయబారులఁ బదునెనిమిది మాసములు దన దగ్గరనే యుంచుకొనెను. ఈలోపలఁ దనరాజ్యస్థితిని జక్కపఱచుకొని, యాయవనప్రభు నాంధ్రరాయబారులం గాంచి "యింకమీరు మీదేశమున కేగవచ్చును. మేము స్వయముగా సేనతో వచ్చి మీరాజన్యుల కుత్తర మొసఁగుదు" మని వారి నంపి వేసెను.

ఆరాయబారుల వలనఁ దురుష్కుల యుద్ధోద్యోగమును విని యనపోతనరపాలుఁడు మండిపడి బలములనెల్ల నోరుగల్లునకుఁ జేర్చెను. అనుకొనినట్లుగాకే యమిత యవన వాహినీసమేతుఁడై 'మహమ్మద్‌షాహ'చేఁ బంపఁబడిన 'బహద్దర్‌ఖాన్, సేనాని దురాశాపరవశుఁడై గోలకొండ మొదలుకొని గ్రామముల దోచుచు, ప్రాణ, మానభంగములఁగావించుచు, దేవాలయమఠాదుల రూపుమాపుచు, మఱియు ననేక దురంతదుష్కార్యముల నొనర్చుచు నోరుగంటిని సమీపించెను. బుక్కరాయలసేనయుఁ గొంతభాగము సాయపడుట కోరుగంటికి వచ్చిచేరెను.

అప్పు డనపోతనృపాలుఁడు తనతనయునకుఁ గొంత సైన్య మొసఁగి మహమ్మదీయసేనలఁ బ్రతిఘటింపఁబంపెను. కాని

బహద్దర్ ఖాన్ సేన మెండుగ నుండెను. అదియెఱింగి యనపోత భూపతి తానును సాయపడనరిగెను. కాని యప్పటికిని యవన సేనయే యెక్కుడుగా నుండుటచే నాసేనానికి శాంతి ప్రియుడగు ననపోతనాయఁడమితధనరాసుల నొసంగి సంధి గావించు కొనియెను.

క్రీ. శ. 1373 లో మఱల నాంధ్రరాజ్యరమను జేపట్ట నుంకించి 'మహమ్మద్‌షాహ' మతావేశపరులగు తురుష్కులచేఁ బ్రబోధింపఁబడి, యేకశిలానగరముపై దండెత్తెను. ఆదండయాత్రలో ననేకసేనతో వచ్చిన వ్యయప్రయాసలు, కాలవిలంబము నగునని నాల్గువేల యాశ్వికులతోఁ బదివేల సేనతో హుటాహుటి నడకల వారము దినములలో నోరుగంటిని ముట్టడించెను. కపట వర్తనుఁడగు నాతండు కోటలో బ్రవేశించుట కొక మాయోపాయ ముపన్ని తనయాశ్వికులలోఁ గొందఱను మాఱువేసములతోఁ బంపించెను. వారేగి దుర్గద్వార రక్షకుల నేమరుపాటొందింపఁ జేసి లోనంబ్రవేశింప నుంకించుచుండఁగా నింతలో 'మహమ్మద్ షాహ' సేనతోవచ్చి లోపలికేగఁబోవ ద్వారపాలకులు ద్వారములను మూయఁ బ్రయత్నించిరి. కాని సుదృఢదీర్ఘవిశాలములగు నాయయః కవాటములు మూయుట సాధ్యపడదయ్యె. ప్రచ్ఛన్న వేషముననున్న యానల్గురుయవనభటులు నిలువుటంగీలలో గుప్తముగా దాచియుంచిన కరవాలములతో నాద్వారరక్షకుల కంఠముల నఱికివేసిరి. యవనవీరులు లోనంబ్రవేశించి యేమఱుపాటున నున్న పౌరుల నాబాలగోపాలము వధించుచుండిరి.

విక్రమశాలియు, స్వామిభక్తుఁడునగు నాగయరుద్రదేవుఁడు యవనవాహిని నరికట్టి బురుజు నధిష్ఠించి, మిగుల ధైర్య సాహసములతోఁ బోరెను. అయుద్ధమున నాస్వామిహితైషి కొన యూపిరి యుండునంతవఱకుఁ బోరి, చివరకు వీరస్వర్గము నందెను.

కలకలము, హాహాకారములు విని యాంధ్రవీరులు నిద్ర

నుండి లేచు సింహముల భంగి విజృంభించి నిశితకరవాలచాలనము నిరుకేలఁ జేయుచు, శరపరంపరలం బరిగించుచు, ముష్టిఘాతంబుల నొందుచు యవనవీరుల వ్రేటునకుఁ బదుగుర నేలఁగూలనేయుచు సత్యద్భుత వీరవిహారముం గావించిరి. అనపోతనాయఁ డాంధ్రవీరులకు, రణరంగోచిత ధర్మంబులం బ్రోత్సహించుచుఁ దానును బ్రతిపక్ష వీరులం బెక్కురం బోరి గొనుచుండెను. ఆంధ్రవీరుల పరాక్రమధాటికి యవనసేనలు చెల్లాచెదరయ్యెను. 'అనపోతనాయఁడు' స్వయముగా 'మహమ్మద్‌షాహ'తోఁ బోరి యాతనిం దనయవక్ర విక్రమక్రమమున యుద్ధపరాఙ్ముఖుం గావించి, పలాయితుం జేసెను. హతశేషులగు యవనులు ప్రాణముపైఁ దీపిచేఁ బలాయన మంత్రంబుఁ జిత్తగించిరి. హతశేషమగు పదునైదు వందలసేనతో 'మహమ్మద్‌షాహ' స్వస్థానమును జేరి, ప్రాణములఁ గాపాడుకొనెను. పలాయితుఁడగు వాని ప్రాణముఁగొనుట వీరలక్షణము గాదని యనపోత ధరణీవల్లభుండు చేఁజిక్కిన శత్రువును విడచెను. ఆహా! సహజవీరులు ధర్మైకనిరతులుగదా?

'బహమనీ' రాజ్యము, రేచర్లవారి రాజ్యము రెండును నిరుగు పొరుగున నుండుటచేఁ దఱచుగా యుద్ధములు తటస్థించుచునేయుండెను. యుద్ధమునఁ బరాజయాపమాన పీడితుఁడై 'మహమ్మద్ షాహ' ప్రచండ వాహినీ సమేతుఁడై దాడివెడలి, తనవాహినిని రెండు పాయలుగా విభజించి, గోలకొండ, యోరుగంటి దుర్గముల నొకేతూరి ముట్టడించెను. ఆసమయమున 'అనపోత' వసుంధరావల్లభుఁ డపారవరూథినీ సమేతుఁడై ధరణికోట రెడ్డిరాజులపై దాడి వెడలియుండెను. మహమ్మదీయులు దుర్గసంరక్షణమాత్ర పరిమిత సేనయైయున్న యోరుగంటి నవలీలఁగా భేదించి కోటను బ్రవేశించిరి.

దుర్గపాలుఁడు తప్పించుకొనిపోయి ధరణికోటనుజేరి రెడ్డిరాజులతో రణరంగమున వీరవిహార మొనర్చుచున్న యనపోత

నాయని కాయవన దండయాత్ర నెఱింగించెను. అపుడా వీరుఁడు లికిపడి సామోపాయ చతురుఁడై రెడ్డిరాజులతో సంధి గావించుకొని యేకశిలానగరమును బ్రవేశించెను. యవన సైనికులు దుర్గమును బ్రవేవించి, యనేక దారుణ దుష్కృత్యములఁ గావించి, విజయసూచకముగా గుడారములలోఁ దిష్ఠవేసికొని యుండిరి.

సంగరమర్మజ్ఞుఁడగు ననపోతనాయఁ డిట్టితఱిఁ దమకు విజయము గలుగుట కష్టమనియెంచి, తమ సేనలు యుద్ధమున నలిఁగియుండుటయును బగవారి దండు మెండుగానుండుటయు నెఱింగి సంధియే కర్తవ్యమని యెంచి రాయబారిని 'మహమ్మద్ షాహ' యెద్ద కనిపెను.

అనపోత మహీనాథుఁడు పుట్టినదాదిగాఁ బరాజయమెఱుఁగడు. నాఁటి యాంధ్రరాజ్యములలో నతఁడే మేటి. తానొక సేనానాయకుని పుత్త్రుఁడైనను, మొక్కవోని బీరమునఁ బరరాజుల గుండెలదర నాంధ్రరాజ్యములోని చాల భాగములఁ దనచ్ఛత్రచ్ఛాయ క్రిందకుఁ దెచ్చెను. ఇట్టియవార్య శౌర్యసారుఁడగు ననపోతధరణీ వల్లభుఁడు రాయబార మంపినదే చాలునని 'మహమ్మద్ షాహ' తనయశక్త దుర్జనత్వము నాత్మనెఱిఁగి, గోలకొండ ప్రాంతముల నొసంగినచో వెనుక కరుగుదునని వర్తమాన మంపెను. కాలపరిస్థితులను, గాఢముగా యోజించి 'యనపోతనాయఁడు' మహమ్మదు షాహ' విధించిన నిబంధనల ప్రకారము గోలకొండ దుర్గమును దత్ప్రాంత ప్రదేశమును, బహుధనము నొసంగఁ గొని 'మహమ్మద్ షాహ' మఱలిపోయెను.

# 5

అనపోతనాయఁడు మహారాజై ప్రజాను రంజకముగాఁ బాలించెను. రేచర్లవంశీయులలో నేరును నిట్లు బహూభూభాగముల జయించి, పాలించినవారు లేరు. కాకతీయ సామ్రాజ్యము మహోచ్ఛ దశయందుండగా నీవంశమువారు సేనాపతులై యుం

డిరి. పూర్వమునుండియు, మనదేశములోని రాజన్యు లొండు రులు నిరంతరముఁ గలహించుచు సంఘీభావము లేకయుండిరి.

అనపోత మహీవరుఁడును రెడ్లతోడను, రాచవారి తోడను బగఁగొనియుండకున్న దక్షిణాపథమున 'బహమని' రాజ్యము స్థాపిత మయ్యెడిదే కాదు. ఈ పద్మనాయక వీరుని రాజ్య మన వరతము సంగ్రామరంగమునకు స్థానమైయుండెడిది. ఒకవంక రాచవారు, మఱియొకవైపు రెడ్డిరాజులు, వేరుదిశ మహమ్మ దీయులు, కయ్యమునకుఁ గాలుద్రవ్వుచుఁ బోరుచు రాజ్యాక్ర మణ వాంఛనుండిరి. ఇట్టి పరిస్థితులయందును ననపోతరాజు రాజ్యపాలనమున నెట్టిలోటును గలుగనీయక జనుల దన పుత్రులట్లరయుచు, వారి యోగక్షేమముల యందెంతో జాగరూ కుఁడై యుండెను. వదాన్యతాగరిమ నల్పిత కల్పపాదపుఁడై కళలఁ బోషించుచు నాదర్శరాజన్యుఁడై యుండెను. ఈ వసుధా విభుఁడు శైవమతావలంబకుఁడై యుండి, నిరంతర శివపూజా పరాయణుఁడై యుండెను. అయినను నితనికిఁ బరమతమున్న ద్వేషముగాని యాదరముగాని లేకుండెను. బహుస్థలముల నీతఁడు భైరవప్రతిష్ఠలఁ గావించెనని శాసనములవలనఁ దెలియు చున్నది. ప్రజోపయోగకరములగు నెన్నియో రాజకీయ సంస్క రణముల నీతఁడొనర్చెను. దేశము సస్యశ్యామలమై యుండుటకు నీతఁ 'డనపోత సముద్రము' 'రాజసముద్రము' మున్నగు తటా కములఁ బంట కాలువలఁ ద్రవ్వించెను. ఈతని భుజబలపరాక్ర మాదులను గూర్చియు, యుద్ధకళా ప్రావీణ్యమును గూర్చియుఁ గవిపుంగవు లెందఱో చాటువులం జెప్పిరి.

అందులో మచ్చున కొకటి రెండు పద్యములు.

"ఆలములోన సింగవసుధాధిపనందనుఁ డన్నపోతభూ
పాలకమౌళి కోడి యనిఁ బారిన వైరుల నాలభంగినే
తోలుచుగాని చంపఁడఁట దోసమటంచును నౌర? రాయగో
పాలున కుర్విలోనఁ బశువర్గముఁ గాచుట సాజమేకదా."

"అశ్వరేవంతుండు హయము నెక్కినయప్డె
దండి రాజుల గుండె తల్లడిల్లు,
దరిని దద్భీకర కరవాలహతికిని
గర్ణాటసేనలు గళవళించు.
సంగ్రామపార్థుని చాపటాంకృతులకుఁ
దెలుఁగు రాజ్యం బెల్ల దిగులుకొనును.
పృథననిశ్శంకకు బల్లెంబు ధాకకు
నులుకులుకు పడుచుండు రొడ్డెరాజు

లతఁడు దరిమినచో నుండు వితములేక
సొరిది 'సురధాని' రాజులు సొంపుదప్పి
యోట మందిరి, సింధూరికోట బయల
సన్నుతఖ్యాతి 'యనపోతమన్నె' రాజు"

అనపోతనరేంద్రుఁడు సంగ్రామరంగముల నెంతమేటియో దేశాహితకార్యములు, రాజ్యాంగవ్యవహారములలో శాంతి ధైర్యములతో విచారించుటలో నంతమేటి. ఈతండు శ్రీశైలమునకు సోపానములను గట్టించెను. దానరాధేయుఁడై యనేక భూసువర్ణాది దానముల నొసర్చెను. రాజ్యాంగ నీతికుశలుఁడగు తిప్పరాజను నతఁడీ మహీధవునకు మంత్రియై యుండెను.

ఈతని యనుజన్ముఁ డగు మాదానాయఁడును బలపరాక్రమాదుల నన్నకు నీడై దేవరకొండ దుర్గసమీపమున 'మాధవపుర' మను నొక పట్టణము నిర్మించి యందే రాజ్య పాలనముఁ జేయుచు నన్న కన్నివేళలఁ దోడునీడయై సకల రాజ్యాంగవ్యవహార కుశలుఁడై, విద్వజ్జనానల్ప కల్పశాఖియై మొక్కవోని బీరమునఁ బ్రజాహృదయము లలరఁ బరిపాలించు చుండెను. ఈతండు శ్రీశైలోత్తరద్వారమున నొక శిలామండపము నుమామహేశ్వరాలయమును గట్టించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది.

ఈ విధముగ 'నాహవపార్థుఁడు' 'రాజ్యపాలనా ధర్మజుఁ' డనఁదగిన యనపోత వసుధావల్లభుఁడు క్రి. శ. 1344 మొదలు 1381 వ సం. వఱకు నిరవద్యముగా రాచకొండ రాజధానిగా నాంధ్రరాజ్యరమాధురంధరుఁడై రాజ్యపాలన మొనర్చెను.

---

# కన్నమదాసుఁడు.

## 1

" పల్లెపదాల జీవము నిల్పుకొన్న ప
ల్నాటి వీరుల రక్తనాళ పటిమ "

శ్రీ. రాయప్రోలు సుబ్బారావుగారు.

పలనాటి సీమలోఁ బుట్టిన వారంద ఱా కాలమున శూరులే. "అచటఁ బుట్టిన చిగురుకొమ్మైనఁ జేవ." కన్నమదాసుని జీవితము నరయుటకు మున్నుఁ బలనాటి వీరుల పూర్వ కథ కొంత తెలిసికొన వలసియున్నది. హైహయవంశీయుఁడగు ననుగురాజు కార్తవీర్యార్జునుఁడు చేసిన బాపములన్నియుఁ దన్ను బాధింపఁగా విదగ్ధులగు విప్రుల యాలోచనమును గైకొని, జీడినూనియ గుడ్డల ధరించి, తన పరివారముతో స్వరాష్ట్రమును విడిచి పాపపరిహారార్థమై యనేక పుణ్యనదులఁ గ్రుంకుచు, నమరావతి రేవునఁ గృష్ణానదిలో స్నానమాడగా నల్లనిగుడ్డలు తెల్లనివాయనఁట. ఈ ప్రాంతముననే యుండి 'చందవోలు' రాజధానిగా వేంగీదేశమునకు రాజప్రతినిధిగా నుండి పరిపాలనము సేయుచున్న ధవళశంఖుఁడను రాజుకూతును వివాహమాడెను. ఆ రాజపుత్రి పేరు మైలమదేవి. ఈయమ తండ్రి యరణముగాఁ 'బల్నాడు' నిచ్చుటచే ననుఁగురాజు గురజాల రాజధానిగాఁ బల్నాటి కధిపతియై ప్రజాపాలనము సేయుచుండెను. ఈ రాజన్యునకు రేచర్ల జేతి

నాయని కొడుకు దొడ్డనాయఁడు మంత్రియైయుండెను. 'అనుఁగు రాజు' నకు 'మైలమదేవి' 'వీరవిద్యాదేవి,' 'భూరమాదేవి' యను మువ్వురు భార్యలు గలరు.

'అనుఁగురాజు' నకు మైలమదేవియందు నలగామ రాజును, వీరవిద్యాదేవి యందు 'పెదమలిదేవరాజు,' 'పినమలి దేవరాజు,' బాలమలిదేవరాజును,' 'భూరమాదేవి' యందు 'నర సింగరాజు,' 'పెరుమాళ్లరాజు,' 'ఝట్టిరాజు' నను వారుద యించిరి.

రేచర్లగోత్రీయుఁడును దొడ్డనాయని పుత్రుఁడగు బ్రహ్మనా యఁడు మిగులశూరుఁడు. తండ్రి యనంతరము మంత్రియై యుండి రాజ్యచక్రము నవక్రవిక్రమమునఁ బరిపాలించుచుం డెను. అనుగుఁరాజు కుమారులఁ దాను మరణించునప్పుడు బ్రహ్మన్న చేతిలోనిడి రాజ్యతంత్రము నరయుచుండుమని మరణించెను.

బ్రహ్మనాయఁడు 'పగవారి గుండెలు బ్రద్దలుసేయు, పటు తరవిక్రమప్రౌఢి సంయుతుఁడు, పెరిగిపెద్దవారైన 'నలగామ రాజు,' నరసింగరాజును, బలనాటిసీమను బాలించుచుండిరి. 'నాగమ్మ' యను పేరుగల నాయకురాలు మాయోపాయమున మంత్రియగు బ్రహ్మనాయన వెడలఁగొట్టించి, తాను మంత్రిణి యయ్యెను. ఎన్నియో విధముల నాయకురాలు బ్రహ్మన్నపైఁ గొండెములు సెప్పి రాజుల మనమును మఱలించెను. నలగామ రాజు నాయకురాలిచేఁతిలో గీలుబొమ్మయై సవతితల్లి బిడ్డలగు (వీరవిద్యాదేవి పుత్రులు) బాలమలిదేవాదులను జంపింపఁ దివి రెను. బ్రహ్మనాయని తల్లియగు శీలాంబ ఘోరమరణమునుండి యాబాలురఁ దప్పించి, బ్రహ్మనాయని వశముఁజేసెను. శూర శిఖామణియు, స్వామిభక్తుఁడునగు బ్రహ్మన్న వీరల నతిప్రే మతోఁ బోషించి, రాజ్యములోఁ గొంతభాగము నిప్పించి 'గుర

జాల' విడచి, 'చంద్రవంక' యను నదియొడ్డున మాచర్ల యను నొక పట్టణముం గట్టించి, వారలంగొనిపోయి బాలుర నందున వారి పక్షమునఁ దానేరాజ్యభారమునుబూని సచివుఁడై ప్రతిపా లించుచుండెను. ప్రజలందఱు బ్రహ్మనాయనిఁ 'బలనాటి కృష్ణుఁ' డనియు దేవాంశ సంభూతుఁడనియుఁ దలఁచుచుండిరి.

## 2.

ఒకపంచమకాంత చిరకాల మెన్నియో దేవతలకు మ్రొక్కు లు చెల్లించియు, ముడుపులు గట్టియు విసిగి 'బ్రహ్మనాయని వరప్రసాదమునఁ బుత్రుఁడు జనించెనేని యబ్బాలు నాతని పాదముల చెంతఁ బడవేయుదు' నని మ్రొక్కుకొనెను. భగవ దను గ్రహమున నామాలెత యంతర్వత్నియై నవమాసములు నిండినవెనుక సర్వలక్షణయుతుండగు నొక్క సుతుంగనియెను. ఆయమ సుతుని వీడియుండఁజాలక కుమారుని బ్రహ్మనాయని కర్పింపక తానే పెంచుచుండెను. ఆపదిమ్రొక్కులు సంపది మఱపు లిట్టివేకదా? ఇట్లుఁగొన్నినాళ్ళు గడువ నప్పిన్ననికి భయం కరవ్యాధి పొడసూపెను. అప్పుడ ప్పంచమాంగన కంటికి మం టికి నేకధారగా మిగుల దుఃఖాక్రాంతయై యేడుచు చుండెను. ఒకప్పు డావనితకుఁ గలలో నొక మహాపురుషుఁడు కానిపించి, "అతివా! నీ వాడినమాటఁ దప్పితివి. కుమారుని బ్రహ్మన్న కర్పిం తునని పుత్రప్రేమతో నాతని కర్పింపవైతివి. అందుచే నీసుతు నకు రోగము వచ్చినది. నీవాడిన మాటఁ జెల్లించుకొందువేని నీ సుతుఁడు నీరోగియు, ధీరుఁడు వీరుఁడు నగు, మఱియుఁ జిరా యుష్మంతుఁడు నగు," ననియెను. కుమారుని కారోగ్యము కలుగ గనే 'బ్రహ్మన్న' దేవున కర్పించు కొందునని మ్రొక్కికొనఁగనే క్రమక్రమముగాఁ బిల్లనికి నారోగ్యము కలిగెను. అప్పుడా మా లెత యొక శుభముహూర్తమున సుతుంగొని, చని భక్తివినయము లతో బ్రహ్మనాయని పాదములం బడవేసి, "మహాత్మా! నీవర

ప్రాభవమున నాకీ తనయుం డుదయించెను. జనించిన వెంటనే మీపాదములం బడవేయ మ్రొక్కియుంటిని. అట్లొనర్పనందున నీనిసుఁగు నిన్న మొన్నటి వఱకు వ్యాధిచేఁ జిక్కియుండె. నేను జన్మకు మాత్రమే తల్లిని, నావాగ్దానముఁ బూర్తి సేయుదు నని మ్రొక్కుకొనఁగా జీవించినాఁడు. మీధర్మపత్నియగు నైతాంబయే (ఈడమ్మ) తల్లి. మీరే జనకులు. ఈనాసుతునిఁ బోషించు భారము మీదే'' యని కుమారునిఁ బలనాటి కృష్ణుని పాదకమలములపైఁ బడవేసెను. ఈపంచమాంగన పేరు పెమ్మసాని. ఈయమ భర్త పేరు తెప్పలినాయకుఁడు. ఈమాట వినఁగనే బ్రహ్మనాయఁ డమితానందము నంది బాలునిఁ గైకొని మూర్ధాఘ్రాణం బొనర్చిఁ పోషించుకొనుమని భార్యకొసంగెను. ఆసాధ్వియు మిగుల నానందించి, దాదులచేఁ బాలిప్పించి నిజసుతున ట్లప్పంచమ బాలునిఁ బెంచుచుండెను. ఆబాలునకుఁ 'గన్నమదాస' ని నామకరణం బొనర్చి తమకు సుతులులేని లోపముఁదీఱ మిగుల నల్లారుముద్దుగా నాతనిం బోషించుచుండిరి. వర్ణాశ్రమాచార ధర్మములు మిక్కిలిగాఁ బాటింపబఁడు నక్కాలమున నీమంత్రి పుంగవుఁడగు బ్రహ్మనాయఁడు మాలెఁత బిడ్డ నిట్లుఁ బెంచుటచేఁ బెక్కురు గుసగుసలాడిరి. కొందఱు మొగముపైననే మాటలనిరి. ఆశ్రితవత్సలుఁడును, సర్వసముఁడు నగు బ్రహ్మన్న యీ మాటల సరకుఁగొనునా?

'కన్నమదాసు' పెరిగి పెద్దవాఁడై గురువులకడ సమస్త విద్యలను, సాముగరిడీలను, ధనుర్విద్యను, శస్త్రాస్త్రప్రయోగ చాతుర్యమును గూలంకషముగా నేర్చి జగజెట్టి యయ్యెను.

సాధ్వీశిరోమణీయగు నైతాంబ యీకుమారుతోఁ గాలక్షేపము సేయుచున్నను, స్వగర్భ జనితఁడగు సుతునికై పరమేశ్వరునిగూర్చి యెన్నియో నోములనోచెను. ఎందఱెందఱో సాధు సత్పురుషుల సేవయొనర్చెను. అనేకదానము లొనర్చెను. మహాపురుషుల యుపదేశమున 'గజనిమ్మ' వ్రతమొక సంవత్సరకాల

మాచరించెను. చెన్న కేశవస్వామి కృపచే నామెకుఁ గొంతకాల మునకు సుతుఁ డుదయించెను. శుక్ల పక్ష సుధాకరుని మాడ్కిఁ బ్రకాశించు నాతనికి బాలచంద్రుఁడను నామకరణ మొనర్చిరి. జ్యోతిశ్శాస్త్రనిష్ణాతులగు బ్రాహ్మణులఁ బిలిపించి, జన్మ తిథివార నక్షత్రాదుల నెఱింగించి, బాలుని భవిష్యజ్జీవిత మెట్లుండునో జాతకమును వ్రాసి యెఱింగింపుఁడని బ్రహ్మన్న విన్నవించెను.

బ్రహ్మనాయనికిఁ బుత్త్రుం డుదయించిన వార్త విని మా త్సర్యవతియగు నాయకురా లొక బ్రాహ్మణున కమితధనమొ సఁగి, యెటులైన బ్రహ్మన్న సుతుంగడతేర్చుమని యుపాయ మెఱింగించి యనిపెను. ఆబ్రాహ్మణుఁడు కపటవర్తనుఁడై తన విద్యావిశేషములఁ బ్రదర్శించి, బ్రహ్మనాయని వశమొనర్చుకొని జాతకము వ్రాయుటకుఁ గొన్ని దివసములు గడువుఁగోరి యరి గెను. మఱలఁ గొన్ని దివసములకు వచ్చి యాకుచ్ఛితంపు విప్రుండు జాతకమును వ్రాసి తెచ్చితినని సభలోదాని నీవిధ ముగాఁ బఠించెను. ఈజాతకుఁడు మిగుల దుర్మార్గుఁడగును. జన్మర్క్షము దుష్టమైన దగుట నీబాలుఁడు వంశనాశకుఁడు, మఱి యు మహాధూర్తుఁడు నగును. అందుచే నీతనిఁ దుదముట్టించు టయే వంశమునకు, దేశమునకు శుభమని వచియించి మిన్నకుం డెను. సభలోనివారు, రాజబంధువులు మిగులఁ జిన్నవోయి, కిం కర్తవ్యతామూఢులై కరుణరస మొలకించు చూడ్కుల బ్రహ్మన్న మంత్రిముఖమునఁ బఱిపిరి. బ్రహ్మనాయఁడు మూఢభక్తివిశ్వాస ములు గలవాఁడగుట దుష్టనక్షత్రసంజనితుఁడగు సుతుఁడు జీవిం చియుండిన, దేశమునకు, వంశమునకు నేమి కీడు మూడునో యని పుత్త్రప్రేమను వీడి ధీరమనస్కుఁడై కానకకన్న సంతాన మైనను బంధువులు, మిత్రులు, పరివారజనంబులు మున్నగువా రందఱ గుండె లవియునట్లు "కుమారుని వధ్యశిలపై వధింప నెంచితి" నని నుడివెను.

అప్పు డొక వృద్ధుండు లేచి "నాయకా! కన్న కడుపును

జేతులార నెట్లువధింపవచ్చును? అయ్యది సాధ్యమును సామా
న్యమును గాదు. సముద్రమునఁ బాఱవైచిన నాతఁడే చచ్చు"
నని పలికెను. 'బ్రహ్మనాయఁడు' పొంగి పొఱలివచ్చు దుఃఖము
నాపుకొని, తన బంటును, నభిమాన పుత్రుఁడు నగు 'కన్నమం'
జీరి, "వత్సా? మీతల్లికడ కేగి, తమ్మునిం గొనిపోయి సముద్ర
మునఁ బాఱవేసి రమ్ము, పొమ్ము. మాఱాడకు" మనియానఁబెట్టె.

అప్పుడా కన్నమనీఁడు మిగుల విచారాక్రాంతమానసుం
డయ్యు, బ్రహ్మన్నకు మాఱుపలుకవెఱచి, సభ్యుల మౌనమును
గాంచి, చేయునదిలేక తల్లికడఁ బాలుగ్రోలుచున్న యమాయికుఁ
డగు నాబాలుంగొని సముద్రమునకుం గొనిపోవుటకు నుద్యుక్తుఁ
డయ్యెను. బ్రహ్మన్న కుటుంబము నాఁడు దుఃఖాబ్ధిలో మునింగి
యుండెను. ఒక్క బ్రహ్మన్న కుటుంబమే యననేల? మాచర్ల
వారందఱు మిగులఁ బనవి పనవి దుఃఖించిరి. అస్వతంత్రుఁడ
నగు నేనీ నిసుఁగు నెట్లు కాపాడఁగలననికన్నమవీరుఁడు మిగుల
విచారించెను. బ్రహ్మన్న యాజ్ఞ సుగ్రీవాజ్ఞ. ముక్కుపచ్చలాఱని
పసినిసువును దొట్టెలలోనుంచి మోసికొనిపోవుచుఁ గాళ్ళు తొట్రు
పడఁ గర్తవ్యతాశూన్యుఁడై యాతల్లి నాతల్లిని బ్రతిమాలి పాలి
ప్పించుచుఁ జందవోలుఁ జేరెను. ఆనాటి నగరములలోఁ జంద
వోలు పట్టణము మిగుల గొప్పది. నేటి 'గుంటూరు' మండలము
లోని బాపట్లకు సమీపమునఁ గలదు. సముద్ర ప్రాంత ప్రదేశ
ము. సుదృఢదుర్గప్రాకార పరివృతమగు నాపట్టణమును జొఱ
వీలు గాక పసిపాపనితోఁ బట్టణము వెలుపలనుండియే సముద్ర
ప్రాంతమును జేరెను.

# 3

పశ్చిమదిశాభాగమంతయు నరుణకాంతులతో వ్యాప్త మ
య్యెను. ఇసుఁ డపరగిరి శిఖరమునుండి, పగలంతయు విధి

విరామములేక నిరాధారమగు గగనసంచారము వలనఁ గల్గిన బడలికఁ బాపుకొన స్నానమొనర్ప నేగెనోయన పశ్చిమాంభోధిఁ బడెను. సందుగొందుల, గిరిగుహలం దాగియుండిన చీకటులు మెల్లమెల్లగా నెల్లెయెడల నరాజకమగు దేశమున జారచోరు లట్లు వ్యాపించెను. కృష్ణపక్షమగుట భూనభోంతరములో నెల్ల యెడలఁ దమము కాటుకపూసినట్లు దట్టముగా నలమి కొని యెను.

అట్టితఱి గన్నమదాసు పసిపాపనెట్లు సాగరముపాలు సేయునా? యని ధైర్యమునువీడి ముక్తకంఠముగా నేడువసాగెను. తొట్టెలలోని పసినిసుగును నాకలిచే నేడ్చుచుండెను. గాఢాంధ కారమున దూరమునుండి యొకవ్యక్తి అర్ధరాత్రమున నిట్టేడ్చు వాఁడ వెవఁడవని గద్దించి యడుగుచు సమీపించెను.ఎన్నిమాఱు లిట్లు ప్రశ్నించినను రోదనముతప్ప వేఱుత్తరములేదు.

చివరకు వచ్చిన వ్యక్తి చేయిపట్టికొని గద్దించి యడిగెను.

కన్నమ: నే నెవఁడనో నీకేల!

వ్యక్తి: నీవీ బాలుని యాభరణముల హరించుటకు కల్లయే డ్పులు నటించుచు నీతనిం జంపనుంకించు చుంటివా? నిజము సెప్పవేని నిన్ను నిపుడ తునుమాడెద.

కన్నమ: నేనెవఁడనైన నీకేమి? అధికప్రసంగము లిట్లే యొనర్తు వేని నీశిరము నీకు దక్కదని గద్దించెను.

ఈవిధముగా నిద్దఱ వాగ్వాదము యుద్ధముగా మాఱెను. విచిత్రఖడ్గచాలన, పరిభ్రమణములతో హోరాహోరిగాబోరిరి. ఇద్దఱ శరీరములు ఖడ్గాఘాతములతో మోదుగులు పూసినట్లె య్యెను. "శీలము బ్రహ్మనాయని సోదరుఁడనేని యీఖడ్గముతో నిప్పుడే నీశిరమును ఖండింతు" ననియె. బ్రహ్మనాయని పేరువిని నంతనే కన్న మనీఁడు ఖడ్గమును గ్రిందవైచి మోకరిల్లి,"తండ్రీ!

నేను బ్రహ్మనాయని యభిమాన పుత్రుఁడను. ఈబాలుఁడు బ్రహ్మనాయని సుతు" డని జరిగిన సంగతి యంతయుఁ బూసగ్రుచ్చినట్లు నొడివెను.

ఆనూతనవ్యక్తి, "కుమారా! నేను బ్రహ్మనాయని యనుజుఁడను 'పేరినీఁడ' నువాఁడను. చందవోలు రాజులకడ సేనానియై యున్నా" నని యుత్తరముసెప్పి "యీకుమారుని సముద్రమునవైచుట మహాపాపము. నేను పెంచుకొందు" నని యాబాలునింగొని, చని, గారాబముగాఁ బెంచుకొనుచుండెను. కన్నమదాసు మనసు కుదుటఁబడఁ బేరీనీనిఁ యాజ్ఞగొని 'మాచర్ల' కేగి బ్రహ్మనాయనికి "మీయాజ్ఞ నెఱవేర్చితి" నని పలికెను. ప్రాణాపాయసమయమున నసత్యమాడుట దోసంబు గాదుకదా?

ఈవిధముగాఁ 'బలనాటిసింహమని ముందు పేర్వయుడ బాలచంద్రుఁడు పేరినీనికడఁ బెరిఁగిపెద్దవాడఁయ్యెను.

తరువాతఁ గొంతకాలమునకుఁ బేరినీఁడుకుమారునిం గొని తెచ్చి యన్నకుం జూపి, సోదరా! సుగుణరత్నఖనియగు సుతునెంతకఠినాత్ములైనను జంపుదురా? కన్నమనాయని దయచే నీ తండు జీవించెను. నాకడఁ బెఱిఁగి పెద్దవాఁడయ్యె. లేకున్న వంశాకూరమగు నీతండు మడిసియుండవలసినదే. గురువులకడ నన్ని విద్యలం గఱచెను. కైకొను మని యర్పించెను. ఐతాంబయు, నాయఁడునుగుమారుండు జీవించియున్నందులకు కడుం గడు నానందించిరి. ఇదియంతయుఁ గన్నమదాసు దయచేఁగల్గినందులకు నాతని బహువిధములం గొనియాడిరి.

కన్నమవీరుఁడును బాలచంద్రుని గారాబముగాఁ జూచుచుఁ దనవెంట నిడుకొని యస్త్రశస్త్రవిద్యలఁ గఱపుచుఁ దన ప్రాణముకన్న నెక్కువగా నరయుచునాతనిఁ దనయంతవీరుగా నొనర్చెను.

కొంతకాల మిట్లు కుమారునితోఁ గాలక్షేపము సేయుచు బ్రహ్మనాయఁడు ప్రజానురంజకముగా రాజ్యపాలన మాచరించుచుండెను.

# 4

పితృభక్తి పరాయణుఁడును, స్వామికార్య నిర్వహణచణుఁడును, మహావీరుఁడు నగు కన్నమదాసు సచివాగ్రణియగు బ్రహ్మనాయనికిఁ గుడిభుజమై మాచర్లకు నాయకురాలివలన నెట్టి యుపద్రవము కలుగకుండ వేయికన్నులతో నరయుచు, మిగుల జాగరూకుఁడై యుండెను.

చారులవలన మాచర్లవైభవమును, బ్రహ్మన్న పరిపాలనా సామర్థ్యమును, బాలమలిదేవాదుల కుశలవార్తను, బాలచంద్రుఁడు జీవించియుంచుటయును, కన్నమవీరుని యకుంఠిత భుజా విక్రమమును, నాలించి, గురజాలరాజులను గీలుబొమ్మలుగాఁ జేసి సర్వరాజ్యచక్రమును ద్రిప్పుచున్న 'నాయకురాలి'కిఁ గన్నులుకుట్టెను. బ్రహ్మన్న రాజ్యము శాంతిసౌఖ్యములతోఁ దులఁదూగియుండుట యావనితకు మేన వేయివృశ్చికములు ప్రాకినట్లయ్యెను. నాగమ్మకడ నెందఱో దోపిడికాండ్రు. ముచ్చులు నామె కనుసన్నలో మెలఁగుచు నూళులదోచి ధనమును దెచ్చువారు గలరు. మెఱియలవంటి ముచ్చులం బిలిచి, మాచర్లను దోపిడిసేయ ముట్టఁ బలికియంపెను. దావానలమునకు వాయువు తోడైనట్లు ముచ్చులు నాయకురాలి యాజ్ఞ కలరి యొకనాఁడు మాచెర్లఁజేరి నిశీదినీసమయమున నిండ్లఁ జొరఁబడి, యిండ్లను గాలించి, చేతఁజిక్కిన ధనకనక వస్తువులనన్నిటినిఁ దస్కరించి చంద్రవంక నదియొద్దను జేరుచుండిరి. ప్రజాహితకారియు, బ్రహ్మన్న నమ్మిన బంటునునగు కన్నమవీరుఁడు మున్నే బ్రహ్మనాయనివలన నీవిషయ మెఱింగియుంట వారలఁ గాపలాగాయుచుండెను. 'చంద్రవంక' నదియొద్దున నాయుధము

లోకచో నుంచి ధనరాసులం బంచుకొనుచున్న తస్కరుల వీరభటులతో నేగికన్నమవీరుఁడు ముట్టడించి వారినందఱను బట్టుకొనియెను. శౌర్య ధైర్య నిధియగు 'కన్నమ' చౌర్యము సేయఁబడిన ధనరాసుల రాచనగరుకంపి, యెవరిది వారి కొసఁగునట్లు కట్టడియొనర్చి ధనమునుగొనిపోవ నాముష్కరులు గొనివచ్చిన గోతముల నిండఁ జంద్రవంకలో యిసుము నింపించి చోరులచే మోయించుకొని యుదయమగుసరికిఁ దావెంటనుండి గురజాలకు వారిని నడిపించెను. ఆదోపిడిగాండ్ర నందఱనొక దొడ్డిలో నికిందోలి బయటి కెవ్వడేని యడుగిడిన వానిని రెండుతుండెములొనర్తునని పలికి ద్వారసీమఁ దాను ఖడ్గహస్తుఁడై పచారులు సేయుచుండెను.

తనయేలుఁబడిలోనున్న గురజాలలోనే, తానంపిన వారిని, గన్నమదాసు బంధించినాఁడని విని నాయకురాలు వ్రేటువడ్డ యురగాంగనయుం బలె నాగ్రహొదగ్రురాలై కన్నులనుండి విస్ఫులింగములు రాలఁ గన్నమవీరుంజేరి, "మాలండా? నిన్నుఁ జించిచెండాడి నీమాంసమును గాకఘూక సరీసృపములకు వేయుదాన" నని బిరుసునఁబాఁబరుసంబులాడెను. సహజశౌర్య ధైర్యుండగు 'కన్నమవీరుఁడు' నాయకురాలి బెదిరింపు మాటలకుఁ జలింపక, కొంకక, యిట్లుత్తరించెను.

'మాలం' డనుచు బుద్ధి మాలి పల్కిన నీదు
నాలుక రెండుగా నఱకువాఁడఁ
'గడజాతి' యనినన్నుఁ గడవఁబల్కిన నీర
దంబుల రాల్చు శౌర్యంబువాఁడ
'ముట్టరా' దని నన్నుఁ దిట్టిన నీకర
ద్వయము కండలుగాగఁ దఱుగువాఁడ
'పంచముం' డని నన్ను నెంచిన నీక్రూర
పంచశాఖలను ఖండించువాఁడ.

'నాయు' నాజ్ఞ లేక నాతినిఁ జంపఁగ
విహితమగునెయంచు విడచినాఁడ
నెందుఁబోయె దింక నిందీవరాక్షినీ
కైశ్యమైనఁ గోసి కాని విడువ.

అని నాయకురాలిం బరిభవింపఁ 'గన్నమ' శూరుఁడు వెనుదవిలియేగ నీశూరుం డెంతకైనఁ దెగించి, తానన్న కార్యంబుం జేయునని యాయమ బెబ్బులి వెంటాడిన హరిణాంగన వోలె నడుగులు దడబడ నెందేని దప్పించుకొని ప్రాణంబులఁ గాపాడికొనియె.

మూగిన పౌరజానపదుల కందఱకు నాగమ్మ దుష్కృత్యంబు లుగ్గడించి, యాయమచేతఁజిక్కి నలగామరాజు సేయు దుష్కృత్యంబులు వెఱవక సందియంపడక ధీరగంభీరముగా నుపన్యసించెను. ధర్మపక్షపాతియు, సత్యవాదియునగు వానికి జడుపేల?

కన్నమదాసు దొంగలఁ బట్టగ నేగి తెల్లవారినను రాకుండుటచేఁ దన యభిమాన పుత్రున కేమి కీడు మూడినదో యని, బ్రహ్మన్న సచివాగ్రణి యున్నతాశ్వమునెక్కి గురిజాలకేగి, పుత్రునివీరకృత్యమునకు, సురక్షితముగా నున్నందులకు సంతసించి యాతని మాచర్ల కనిపెను.

## 5

బ్రహ్మనాయఁడు నలగామరాజాదుల దర్శింప గురిజాల లోనే యుండి రాజప్రాసాదమున కేగెను. వారితో నిష్టగోష్టినుండి రాజకీయ విషయములఁ జర్చించెను. మాయావినియగు నాయకురాలు మిగుల నాదరించు దానివలెఁ బ్రియభాషణము లాడెను. బ్రహ్మన్న కొఱకై రాజకుటుంబమువారు గొప్ప విందుఁ గావించిరి. నాయకురాలు మాయోపాయ చతురురాలై బ్రహ్మన్నకు

నన్నములో విషమును బెట్టించెను. ఆహాలహలము జాహ్నవి (విషము) జలమువలె బ్రహ్మన్న కారోగ్యదము, పుష్టిదము నయ్యెను.

ఆసమయముననే బ్రహ్మన్న నాయకురాలితోఁ గోడి పందెములాడెను. ఓడిపోయినవారేడు వత్సరములు రాజపుత్రులతోఁ బరసీమల వసింపవలయునను బందెము వేసి ప్రమాణపత్రములను వ్రాసికొనిరి, మహాకోలాహలముగాఁ గుక్కుటయుద్ధము జరుగుచుండెను. మాయోపాయము, మంత్రబలము, దైవదౌర్బల్యము వలన రేచర్ల సచివాగ్రణి కుక్కుటమోడి, నాయకురాలి చరణాయుధము గెలిచెను.

సత్యసంధుఁడగు బ్రహ్మన్న సచివాగ్రణి రాజపుత్రులు పరివారమును నడవుల నేడేండ్లు గడపుటకు నేగెను. బ్రహ్మనాయని వెంటఁ గొమ్మభూపాలకుఁడు, నలరాచమల్లు, పెద్దన్న, పేర్నీఁడు సూరినీఁడు, మల్నీఁడు, సుంకరదామానాయఁడు, కన్నమనీఁడు నను నష్టదిగ్గజములవంటి శూరశిఖామణులు భక్తితత్పరులై యరిగిరి.

ఆగర్భ శ్రీమంతుడు, సాధుశీలుఁడు నగు బ్రహ్మన్న రాజపుత్రులతో నడవులఁ బాండవులట్లు మిగుల నిడుమలఁ గుడిచెను. బ్రహ్మనాయని పశుబృంద, మడవిలోఁ బూరిమేసి చియ్యఁ బట్టి మిగుల నభివృద్ధి నందియుండెను. దుస్సంధయగు నాయకురా లడవిలోఁ గాలముఁ గడుపుచున్న బ్రహ్మనాయని పశుకదంబంబులఁబట్టఁ గిరాతుల నంపెను. అవ్యాధకదంబము 'బ్రహ్మనాయని' పశుకదంబములఁ ,గౌరవులు విరాటుని గోవులట్లదలించికొనిపోయిరి. 'బ్రహ్మన్న' సేనాపతియుఁ బశుపాలకుఁడు నగు 'లంకన్న' కిరాతులతోఁబోరి వీరస్వర్గము జూఱఁగొనియెను. కాని బ్రహ్మనాయని పాదసేవకుండును, విష్ణుభక్తుండు నగు 'కన్నమవీరుఁడుఁ'

పంౘ్రెండు మూరల భైరవ ఖడ్గంబు
నాలుమూరల కంచు టరిగె దనర
మత్తదంతావళ మండలిపైఁ బాలు
పంచాస్యడింభక భాతి నలరఁ
దరళజీమూత బృందంబుపై నేతెంచు,
ప్రబల ఝంఝూ సమీరంబు పోల్కి
పశుకదంబంబుపైఁ బఱతెంచు భయదశా
ర్ధూలంబులీల నద్భుతపరాక్ర

మక్రమంబున వెడలి నిర్వక్రవీర్య
శౌర్యగాంభీర్య పటుభుజావీర్యముల న
లంకరించి, తదీయబలంబు నెదిరి
మొదవుల మఱల్చె రిపుల దుర్మదము సెదర.

ఈవిధంబుగాఁ జెంచులఁ గిరాతుల నోడించి, సంగ్రామ రంగవిజయుఁడై యాలమందల మఱలించెను. మందాదినుండి కిరాతులందఱిమి తఱిమి కొట్టెను. బ్రహ్మన్న కన్నమదాసుని శౌర్యవీర్య పరాక్రమాదులకు విస్మయంపడియెను. బ్రహ్మన్న యీప్రాంతముననున్న నాయకురాలేవియో మాయోపాయములఁ జేసి తమ్ము బాధించునని యందఱతో శ్రీశైలము మొదలుగాఁ బుణ్యక్షేత్రముల సేవింపనేగెను. రేచర్ల సచివసత్తముఁ డీవిధముగా వనవాసమున నుండియుఁ, బుణ్యకార్యముల నాచరించుచుఁ, బ్రతిజ్ఞావత్సరములను వీర మేడపియను పట్టణంబునం గడపెను.

'కొమ్మరాజు' ననుగుసుతుండును 'నలగామరాజు' నల్లుండునగు 'నలరాచమ'ల్లను వానిని రాజకుమారుల పక్షమున గురజాలకు రాయబార మంపుటకు యత్నింపఁగా వీరశిఖామణియగు 'కన్నమదాసు' 'తండ్రీ! 'నాయకురాలు' సంధి వచనములు, రాయబారమును వినునా? దుస్స్వభావయుఁ గుతంత్ర చతురయు నగు 'నాగమ్మ' నలగామ రాజాదులను సామోపాయమున రాజ్య

భాగ మీయనిచ్చునా? చతుర్థోపాయ సాధ్యులయెడ సామమునఁ బ్రయత్నించుట పిఱికితనముగాదే? అందుచే నాగమ్మ నణఁచి రాజ్యముఁ గొనుటకుఁ గదనమే శరణ్య" మనియెను. పలనాటి సింహమగు బాలచంద్రుఁడును గన్నమవీరుని మాటకుఁ దాళము వేసెను.

'బ్రహ్మనాయఁడు,' "కుమారా? మనమై యుద్ధమునకు దిగరాదు. కాల మన్నింటిని జక్కవఱచును. రాయబారము ఫలంపనినాఁడు యుద్ధముననే భాగము సాధింతము." అని వచియించి, వృద్ధశిష్టాను మతంబున నలరాచమల్లును రాయబార మంపెను. ఈతండును రాజోచిత వేషముం దాల్చి గురజాల కేగి సభలో నందఱముందఱ భాగవిషయము నొడివెను. నాయకురాలికి వశవర్తియగు నలగామఁడు 'బాలమలిదేవాదులకుఁ బూరిపుడక మోపిన యంత తావునేని యీయ" నని, బ్రహ్మన్న పక్షమువారిని మిక్కుటముగాఁ దూలనాడెను. అప్పుడు రాచమల్లు నిర్భీకుఁడై మామపై నలిగి కన్నమదాసాదుల పరాక్రమ్మక్రమము నుగ్గడించి, బ్రహ్మనాయని కీవృత్తాంతమును నివేదింపమఱలెను. కాని కపటవర్తనయు, దయాదాక్షిణ్యము లేని నాగమ్మ విషప్రయోగము సేయించి రాజజామాతయగు రాచమల్లును జంపించెను. అక్కటా? దుష్టవర్తను లొనర్పఁగూడని పనియుండునే?

రాయబారమున కరిగిన రాచమల్లు మరణించుట విని బ్రహ్మన్న మండిపడి యుద్ధోద్యోగం బొనర్చుచుండె. ఉభయ పక్షములను పలువురు రాజులు, బంధులు బహుళసేనాయుతులై వచ్చి, చంపను జావను సిద్ధపడియుండిరి. సంజయ, కృష్ణరాయబారములవలె నుభయపక్షములనుండియు జరిగిన సంధి సందేశములు వ్యర్థములయ్యెను.

ఉభయపక్షముల యపార చమూతతియు కార్యమపూడి చెంత నాగులేఁటి తీరమున విశాలప్రదేశమున యుద్ధమొనర్చెను. బ్రహ్మన్న పక్షమున నాతని యభిమాన పుత్రుండగు కన్నమ

వీరుఁడు సేనానియై సేనల నడపెను. బ్రహ్మన్న యానతిచే వీర తాంబూలమునంది.

కరమున గుజ్జరి కడియముల్ మెఱయ
నేలైన పిడిగంట నెమలిసోగలును,
నల్లని ధట్టిని నయమొప్పఁ గట్టి
ఘోరభైరవగద కోరమీసములు

నెగుభుజంబులు మించు నెఱజేరుగుఁడ్లు
ఘనమైన దేహంబు కాలిపెండరము
వెరవైన భీకర వేషంబుతోడ
కదలెఁ గన్నమనీఁడు కదనభూమికిని.

... ... ... ... ...

అకుంఠిత భుజాబల మేదురండగు కన్నమవీరుఁడు రణ రంగమున నరివీరుల నరఁటిపిలకల నఱికినట్లుగా నఱుకుచుం డెను. వీరులెవ్వరుఁ గన్నమనాయని నెదిరింపలేరైరి. ఇంకయు రేచర్ల పేర్నీఁడు, సుంకర దామానాయఁడు మున్నగువారును మొక్కవోని బీరమునఁ బోరుచుండిరి. కదనరంగమంతయు రుధిరాప్లుతమయ్యెను. కన్నమనీఁడు శత్రుసైన్యముల నిరవశేష ముగా వధించుచుండెను. ఆహవాభిమన్యుఁడును బలనాటిసింహ మనఁదగు బాలచంద్రుడు యుద్ధమున నరసింగ రాజాదులతోఁ బోరి వారి వధించి వీరస్వర్గముం జూఱఁగొనియెను. బాలమలి దేవ రాజాదులును మరణించిరి. వీరందఱ మరణమునకు బ్రహ్మనాయఁడు మిగుల విచారవిషాదాక్రాంత హృదయుఁడై యుండ మహావీరుఁడగు 'కన్నమదా' నరుదెంచి నాయకురాలు దప్ప నందఱు మరణించిరని మనవిచేసెను. బ్రహ్మన్న కన్నమ వీరుని పరాక్రమక్రమమున కలరి "కుమారా? ఇఁక నేకాకిని యగు నాయకురాలేమిచేయఁగలదు! పితౄణముఁ దీర్చితివి, దుష్టశిక్షకుఁడ వైతివి. నీవీరగాథ శాశ్వతమై యిలనిలువఁగల"

దని వీరమేడపిలోనున్న యవరోధకాంతలఁ బిలిపించి, యెవరికై తాని యుద్ధముఁ జేయవలసి వచ్చెనో యారాజపుత్రులందఱు మరణించుటచే విరాగియై రణావని నసువులంబాసిన వీరుల కందఱకు దహనసంస్కారాదు లొనర్పించి గుత్తికొండ(గుచ్ఛాద్రి) బిలమున వేఱవేఱ పేరులం జెప్పి తిలోదకము లిచ్చుచుం డెను. అప్పుడు నాయకురాలు నాగుపాము పగగలదై బ్రహ్మన్న కులకాంతల నందఱం గొని బిలమున నున్నాఁడు. కాన నిప్పుడీ బిలద్వారమును మూయించితి మేని యందఱు మరణింతురని యెంచి తనభటుల ద్వారములను మూయఁబంచెను. అసన్న యెఱింగి స్వామి భక్తుఁడును, దుష్టశిక్షకుఁడగు కన్నమవీరుఁడు, కాలభుజంగంబువోని నిశితకరవాలమున నాభటుల వధించి యట్టి పనిఁ జేయించిన పలనాటి వీరనారియగు నాయకురాలినిఁ బట్టి కట్టి తెచ్చెను. బ్రహ్మన్న రణాంగణ మృతులగు వీరుల కందఱకుఁ దిలోదకము లిచ్చిన యనంత మంతఃపుర కాంతలు సహగమన మొనర్చిరి. నాయకురాలు బ్రహ్మన్న సచివాగ్రణీ పాదములపైఁబడి తెలియక యొనర్చిన సాహసమును మన్నింపు మని వేడికొనియెను. సదయహృదయుఁడగు బ్రహ్మన్న నాయకు రాలిని మన్నించెను. ఆహా! మహాత్ములు దయాసారులు గదా!

సచివోత్తముఁడగు బ్రహ్మనాయఁడు బిలములోని ప్రవాహ జలమునఁ బడి యదృశ్యుఁడయ్యెను. కన్నమవీరుఁడును నాయ నికి భక్తిభావమునఁ దర్పణాదు లొసంగి, తానును బిలప్రవా హమునఁబడి యదృశ్యుఁడయ్యెను.

ఆహా! కన్నమదాసుని జీవితము, దేశభక్తి, ధర్మదీక్ష, స్వామికార్యపరత, అపకప్రవిక్రమము, సోదర ప్రేమ మున్నగు నాదర్శ గుణరత్నములకు ఖనియనఁజెల్లును.

నాయకురాలు యుద్ధరంగముననే కన్నమవీరునకు జిక్కె ననియు, నప్పు డామె నాతండు బ్రహ్మన్న పాదములపైఁ బడ వేయఁగా నాతఁడాయమను క్షమించి విడచె ననియు నాయకు

రాలు చిక్కుటచే నిఁక చేయునదిలేక నలగామరాజు బ్రహ్మన్నను శరణుఁ జొచ్చెననియు నప్పుడు బ్రహ్మన్న యాతనిం బునర భిషిక్తుంగావించి, యపారయశంబునందెననియుఁ జరిత్రకారు లభిప్రాయపడినారు.

బ్రహ్మనాయఁడు వైష్ణవమతావ లంబకుఁడు. వర్ణాచార వ్యవహారములలో మిగులఁ బట్టింపుగల యాకాలమున నీతఁడు తక్కువజాతి వారికిని శ్రీవైష్ణవం బొసంగి వారితో సహపంక్తి భోజనాదు లొనర్చినట్లును దెలియుచున్నది.

కన్నమదాసుఁడు, నీవెవఁడవని యొకప్పుడొకరు విచా రింపఁగా నిట్లువాకుృచ్చినట్లు వీరచరితమున వర్ణింపఁబడి యున్నది.

మాలలకునుబుట్టి మాలనై పోక
విష్ణుపాదముఁబట్టి విశ్వంబులోనఁ
బెప్పులినాయఁడు తెఱవయైనట్టి
యంబుజలోచన పెమ్మసానికిని
శ్రీమించు మాచర్ల చెన్నుని మేనఁ
బెంపొందెడు తులసిపెదవనమాల
వరమునఁ గన్నట్టి వరపుణ్యసుతుఁడఁ
గన్నమనాపేరు...

మఱియొకపఱి బాలనాయఁడు.

" బ్రహ్మనాయఁడు నీకుబాంధవం బెట్లొ
వినిపింపు కన్నమ! వివరంబుగాఁగ "

అని ప్రశ్నింపఁగా?

"నాయఁడు విష్ణువు, నారాయణుండు.
ప్రకట దయాంబుధి వరములొసంగెఁ

దగజనించితి నేను దల్లిగర్భమునఁ,
బరమపావనమూర్తి బ్రహ్మనాయనికిఁ
బాదసేవకుఁడనై పరఁగినవాఁడ
భుజముల ముద్రలు పూనినవాఁడ
క్షుద్రమార్గుల నెప్డు చూడనివాఁడ
ప్రాసాదజీవినై ప్రబలినవాఁడ
జ్యేష్ఠపుత్రుఁ డనంగఁజెలగినవాఁడ"

పలనాటి వీరులచరిత్రమున నొకరొకరిచరిత మొకొక మానవాదర్శమునకు దృష్టాంతము. కాని కన్నమదాసుని జీవితాదర్శమన్నిఁటికిఁ దలమానికమై యొప్పుచున్నది.

పలనాటి సీమలో నేటికినా యుద్ధరంగమున వీరస్వర్గము జూఱఁగొన్న వారి నారాధించుట కలదు. ప్రతివత్సరము కార్తీక శుద్ధ పూర్ణిమనాఁడు యుద్ధరంగమున నెఱ్ఱని జండా యెత్తుటయు, వీరారాధనమును జేయఁబడుచున్నది. అందంతిమజాతి వారికన్న నగ్రవర్ణజులె కన్నమవీరు నారాధించుచున్నారు. శౌర్య ధైర్య సౌశీల్యాదిగుణములు గలకన్నమవీరుఁ డందఱకును వంద్యుఁడె. అతఁడమరజీవి. పలనాఁటివీరుల యమరవీరగాథలను సర్వాంధ్రప్రజానీకమును, గేయములు పల్లెపదములలోఁ బాడి నేటికిని యుద్రేకపూరితమగుచున్నది. శాంత్యహింసలతో శౌర్య సాహసముల జతఁగూర్చి చల్లగా సాగనెంచుచున్నది.

ఓమ్ శాంతిః